"ఆటలో ఆటగా నవ్వులో నవ్వుగా, సరిగ్గా చూసీ, ఆలోచించీ, టక్కున అంటించాలీ యింక, సరదాగా యిది చెయ్యాలింక" — ఫెవీ ఫెయిరీ




పోర్కీ పిగ్ ఎలా తయారు చెయ్యాలో
అనే తిరువి ఉచితంగా పొందటం కోసం యీ కూపన్ను
పంపించండి లేదా యీ చిరునామాకు వ్రాయండి:
"ఫెవీ ఫెయిరీ" పోస్ట్ బాక్స్ 11084, బొంబాయి 400 020

# గెల్చుకోండి!




1టవ బహుమతి: అమెరికా, జపాన్ దేశాలలోని డిస్నీలాండుల పర్యటన!

50 2వ బహుమతులు: ముచ్చటైన స్పోర్ట్స్ బైసికిల్స్!

50 తొలి ఎంట్రీ బహుమతులు ప్రతి వారం: అందమైన డిజిటల్ గడియారాలు!

త్వరపడండి!
పోటీ ముగిసే తేదీ
14 సెప్టెంబరు 1985

పాల్గొనండి!




పాపిన్స్ 'స్పెల్-ఎ-ప్రైజ్' పోటీలో

ప్రవేశ పత్రాలు, మీ కిష్టమైన దుకాణాల్లో లభిస్తాయి.

everest/85/PP/126-tl



# చందమామ

ఆగస్టు 1985



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





విడి ప్రతి: 2-00

సంవత్సర చందా: 24-00

మీ చిన్నారి పాప నూనూగు బుగ్గలపైన మీరిచ్చే ముద్దులా సున్నితంగా

పాప చిన్నారి లోకంలో ఎవరైతే అలరే అతి
ప్రత్యేకమైన అతి కొద్ది వస్తువుల్లో ఒకటి - జాన్సన్స్
బేబీ సోప్.

అపేక్ష చివికే మీ స్పర్శలా మృదువుగా చేస్తుంది
జాన్సన్స్ బేబీ సోపులోని లెనోలిన్ అనే పదార్థం.
మరి దానిలోని ఆ సువాసన మీ పాపపై
చిలుకుతుంది, దాంతో ఎంత పాపకు చక్కగా
సహజమైన ఆ సువాసన.




జాన్సన్స్ బేబీ సోప్
శుద్ధమై... సౌమ్యమై... భద్రమైనది.

Johnson & Johnson

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''వరపరీక్ష'']కు ఆధారం, ''వసుంధర'' రచన. ఆశాపాతకులైన మనుషుల కోర్కెలకు హద్దులంటూ వుండవు. వాళ్ళు తృప్తికి దూరమవుతారు. వాస్తవం ఏమిటో చెప్పి, గత జీవితాన్ని గుర్తుచేస్తే, వాళ్ళల్లో మంచి మార్పువచ్చే అవకాశం వున్నది. ''తీరని కోరిక'' అన్న కథలో యిది తెలుసుకుంటాం.

## అమరవాణి

బహిః ర్మరీచం మలివ, మంతస్సారం హి దృశ్యతే,
వికారరూపోపి బుధః, హృది ప్రజ్ఞాన్వితః ఖలు.

[రూపాన్ని చూసి అంతస్సారాన్ని గ్రహించలేం. మిరియపుగింజ నల్లగావున్నా, దాని రుచి ఘాటుగా వుంటుంది. వికారరూపులైన మహా పండితులనేకుల్ని మనం చూస్తూంటాం.]

సంపుటి 77 ఆగస్టు '85 సంచిక 2

విడి ప్రతి : 2–00 : : సంవత్సర చందా : 24–00



బలే మజా గోల్డ్ స్పాట్ మజా




Artificially flavoured. Contains no fruit juice or fruit pulp.

serve chilled



## చందమామ కబుర్లు



### దొంగలను పట్టిన చిలుక

ఒక సంపన్న గృహంలో ఒకసారి పెద్ద దొంగతనం జరిగింది. దొంగతనం ఎవరు చేశారో ఎవరికీ అంతుబట్టలేదు. ఆ ఇంటి యజమానురాలు సాకుతూన్న చిలుక, "రోసీ ఇటురా, రాబర్ట్ ఇలారా," అని పలకడం గమనించి, పోలీసులకు తెలియజేసింది. బందిపోట్లుగా పోలీసు రికార్డులలో నమోదు అయి ఉన్న రోసీ, రాబర్ట్ అనేవాళ్ళను, పోలీసులు అరెస్టు చేశారు. ఇంట్లో ఎవరూ లేరని ఆ దొంగలిద్దరూ, ఒకరినొకరు గట్టిగా పిలవడం విన్న ఆ చిలుక, ఆ మాటలనే వల్లించసాగింది!

### కరిగిపోయే లోహం



న్యూహాంప్‌షైర్‌లోని ఒక కంపెనీ, కొత్తలోహాన్ని కనుగొన్నది. ఇది లోహమే అయినా నీళ్ళలో పడవేసినట్టయితే, పన్నెండు నిమిషాలలో కరిగిపోయి, ఉన్నచోటు తెలియకుండా పోతుంది!



### మునిగిపోయిన నగరం

శ్రీకృష్ణుడి నిర్యాణం తరవాత ద్వారకానగరం సముద్రమయమై పోయినట్టు మహాభారతం చెబుతున్నది. ఇటీవల డా॥ ఎస్. ఆర్. రావు నాయకత్వంలో జరిగిన పురావస్తు శాఖ త్రవ్వకాల పరిశోధనలు— నిజంగానే క్రీ॥ పూ॥ 1500 సంవత్సరానికి చెందిన పురాతన నగరం సముద్రంలో మునిగిపోయినట్టు తెలియజేస్తున్నవి!

## మీకు తెలుసా?

1. భూమి గుండ్రంగా ఉన్నదని తన విశ్వాసాన్ని మొట్టమొదట వ్యక్తం చేసినవారెవరో మీకు తెలుసా?
2. మొట్టమొదటిసారిగా భూమి చుట్టుకొలతను లెక్కగట్టిన వారెవరు?
3. ధ్రువప్రాంతాలలోకన్నా భూమధ్యరేఖకు సమీపంలో వస్తువులబరువు తక్కువగా ఉంటుంది, ఎందువల్ల?
4. ప్రపంచంలోకెల్లా పెద్దదైన కృత్రిమ రేవు పట్టణం ఎక్కడున్నదో మీకు తెలుసా?
5. ప్రపంచంలోకెల్లా పెద్ద ఎడారి సహారా. మరి రెండవ పెద్ద ఎడారి ఎక్కడ ఉన్నది?

(సమాధానాలు 65వ పేజీలో)

పురాణగాథలు :

# అజామిళుడు

పూర్వం ఒకప్పుడు కన్యాకుబ్జంలో అజామిళు డనే బ్రాహ్మణుడు ఉండేవాడు. బాల్యంలో అతడు సత్ప్రవర్తన, సదాచారం కలిగి ఉండేవాడు. యుక్తవయస్కుడయాక, ఒకనాడు అతడు పువ్వులు కోసుకురావడానికి పుష్పవనానికి పోయి తిరిగివస్తూ, దారిలో మద్యపానం, జూదం మొదలైన దుర్వ్యసనాలకు బానిసలై విచ్చలవిడిగా ప్రవర్తించే కొందరిని చూశాడు.

ఆ క్షణం నుంచీ అతడి మనసు కూడా పెడమార్గం పట్టింది. ఇల్లూవాకిలీ వదిలిపెట్టి, కల్లు అమ్ముతూ ధర్మవిరుద్ధమైన పనులుచేసే ఒక స్త్రీని పెళ్ళాడి విలాస జీవితం సాగించాడు. వాళ్ళకు ఎనిమిది మంది సంతానం కలిగారు. ఆఖరివాడికి, నారాయణుడని పేరు పెట్టుకున్నారు.

అజామిళుడు వృద్ధుడై జబ్బు చేసి మంచం పట్టి అవసానదశకు వచ్చాడు. అతని కళ్ళకు యమభటులు కనిపించారు. అప్పుడతడు మరణభయంతో, తన ప్రియమైన చిన్నకొడుకు కోసం, "నారాయణా! నారాయణా!" అని అరిచాడు. ఆ మాటలు విష్ణుదూతల చెవుల్లో పడగానే, వాళ్ళు వచ్చి మరుక్షణమే అజామిళుడి సమక్షంలో వాలారు. ఆ సమయంలో అక్కడ ఉన్న యమభటులకూ, విష్ణుదూతలకూ మధ్య అజామిళుడిని యమలోకానికి తీసుకుపోవడమా? లేక విష్ణులోకానికి తీసుకుపోవడమా అన్న విషయం మీద వాదప్రతివాదాలు బయలుదేరాయి. స్పృహకోల్పోయి ఉన్నప్పటికీ, వారి మాటలన్నీ అజామిళుడికి మెల్లగా వినిపించాయి. ఆ మాటలు విని తానెంతటి పాపజీవితం గడిపిందీ తలుచుకుని, అతడు పశ్చాత్తాపం చెందాడు.

ఆఖరికి, "ఇతడు విష్ణుభక్తుడయే ఉంటాడు. మేమే పొరబాటున ఇక్కడికి వచ్చి ఉంటాము," అని యమభటులు అక్కడి నుంచి వెళ్ళిపోయారు. మరణఘడియలు దాటిపోగానే అజామిళుడు చావు నుంచి బయటపడి క్రమంగా కోలుకోసాగాడు.

అప్పటి నుంచి అజామిళుడి జీవితంలో పెద్ద మార్పు వచ్చింది. తన కొడుకును ఒక్కసారి, "నారాయణా!" అని పిలిచినందుకే విష్ణుదూతలు రావటం తలుచుకుని, దేవుడి అపారమైన ప్రేమకు పరమానందం చెందాడు. శేషజీవితాన్ని దైవభక్తితో, ధర్మచింతనతో, సదాచారంతో గడిపి, గంగాతీరంలో భౌతికకాయాన్ని వదిలి విష్ణులోకాన్ని చేరాడు!






## 10

[చీకటి పడిన తరవాత చెట్టుకొమ్మల్లో నిద్రిస్తున్న చంద్రవర్మ గండభేరుండ పక్షులు రేపిన గాలికి, అక్కడినుంచి ఎగిరివచ్చి, ఒక పక్షి వెన్నుమీద పడిపోయాడు. ఒక రాత్రి వేళ ఒక అగ్నిపక్షి అక్కడికి వచ్చి, గండభేరుండ పక్షులను, మంత్రగత్తె కాపాలినిని పట్టుకుని శంఖుడి దగ్గిరకు తేవలసిందిగా కోరింది. అవి అంగీకరించాయి. తరవాత—]

అగ్నిపక్షి గండభేరుండ పక్షులతో జరిపిన సంభాషణ అంతా అతి శ్రద్ధగా విన్న చంద్రవర్మకు ఎక్కడలేని ఆనందమూ కలిగింది. కాలనాగు సహాయంవల్ల తను వింతవృక్షం నుంచి పండు కోసుకు తినటంవల్లనే, తన కీనాడు పక్షుల భాష తెలియటం సంభవించింది. అందువల్ల తను నూరు యోజనాల దూరంలో వున్న శంఖుడిని చేరటానికి కాలి నడకను బయలుదేరి నానా ప్రమాదాలకూ లోను కాకుండా, యీ గండభేరుండ పక్షి ఈకలలో దాక్కుని సునాయాసంగా అక్కడికి చేరవచ్చు.

అనుకోకుండా తనకు పట్టిన యీ అదృష్టాన్ని తలుచుకుని చంద్రవర్మ ఎంతో పొంగిపోయాడు. ఎప్పుడు తెల్లవారుతుందా, ఎప్పుడు గండభేరుండ పక్షులతోపాటు తాను కూడా నూరు యోజ

నాల దూరం ఎగిరి శంఖుడు వుండే కొండ చూస్తానా అని అతడు ఆత్రపడసాగాడు. కాపాలినిని చేజిక్కించుకునేందుకు శంఖుడు ప్రయోగించనున్న కపటో పాయం తప్పక వమ్ము కాగలదని అతడు భావించాడు. కాపాలిని అంత అమాయకు రాలు కాదు. బహుశా ఆమె తనను పట్టి వచ్చిన గండభేరుండ పక్షులను కాల సర్పానికి ఆహారంగా వేసి తీరుతుంది.

చంద్రవర్మ యిలాంటి ఆలోచనలతో సతమతమవుతూండగానే భళ్ళున తెల్ల వారింది. గండభేరుండ పక్షులు సూర్య కిరణాలు మీద పడగానే కళ్ళు తెరిచి, రెక్కలల్లల్లాడించి గాలిలోకి లేచినై. పక్షి వెన్నుమీది ఈకలలో దాగివున్న చంద్ర వర్మ అవి ఉత్తర దిక్కుకేసి పోతున్నట్టు గ్రహించి చాలా ఆనందపడ్డాడు. చూస్తూండగానే కొండలూ, నదులూ, అడవులూ దాటి గండభేరుండ పక్షులు ఒకానొక కొండను సమీపిస్తున్నవి. వాటి సంభాషణను బట్టి, ఆ కొండ శంఖుడు వుండేదని చంద్రవర్మ గ్రహించాడు.

హఠాత్తుగా చంద్రవర్మ దాగి వున్న గండభేరుండ పక్షి కిందికి చూసి, రెండవ పక్షితో, "మిత్రమా, ఈ సరస్సు చూశావా? అదుగో! ఏనుగంత లావున్న మొసలి! మొసలి మాంసం తిని చాలా రోజులైంది!" అంటూ చటుక్కున సూటిగా కిందికి తిరిగి బాణంలా నిలువునా సరస్సుకేసి దూకింది.



ఇంత హఠాత్తుగా తను వున్న గండ భేరుండపక్షి సూటిగా కిందికి వాలేసరికి చంద్రవర్మ ఒక్క క్షణం తబ్బిబ్బయి పోయి, తను పట్టుకున్న ఈకలను వదిలి వేశాడు. మరుక్షణం అతడు పక్షి మీది నుంచి పక్కకు దొర్లి, తలకిందులుగా గాలిలో తేలిపోతూ వేగంగా కింద ఉన్న సరస్సులోకి పడసాగాడు.

చంద్రవర్మ తన వీపు మీది నుంచి జారి సరస్సులోకి పడిపోతూండడం గండ భేరుండ పక్షికి తెలియదు. అది తన దృష్టిని నీటి మీద తేలుతూన్న పెద్ద మొసలి వైపుకు కేంద్రీకరించింది. చంద్ర వర్మ దృష్టి కూడా ఆ మొసలికేసే ప్రస రించింది. తను గండభేరుండ పక్షికో లేక సరస్సులోని మొసలికో ఆహారం అయి పోతానని అతడు నిశ్చయించుకుని ఆపాద మస్తకం వణికిపోసాగాడు. ఇంతలో సరస్సులో నుంచి పెద్ద జలధార ఒకటి తాడిచెట్టు ప్రమాణంలో ఆకాశంకేసి లేచింది. దభీమంటూ నీట పడిపోతూన్న చంద్రవర్మ తల పక్కకు తిప్పి అటుకేసి చూశాడు.

గండభేరుండ పక్షి దిక్కులు పిక్క టిల్లేలా పెద్దగా కేకవేస్తూ పైకి ఎగిరి పోతున్నది. దాని గోళ్ళ మధ్య మొసలి విలవిలా తన్నుకుంటున్నది.

చంద్రవర్మ యీ దృశ్యాన్ని కనురెప్ప పాటు కాలం మాత్రమే చూడగలిగాడు. మరుక్షణం అతడు సరస్సులో బుడుంగు





చంద్రవర్మ ప్రాణాపాయం నుంచి బయటపడ్డాననే ధైర్యంతో గబగబా యీదుకుంటూ సరస్సు ఒడ్డుకేసి పోసాగాడు. ఆ సరస్సు ఒడ్డున గుబురుగా పెరిగిన చెట్లు వున్నవి. ఒకసారి తను ఆ ప్రాంతాన్ని చేరుకుంటే, మాంత్రికుడైన శంఖుడి భృత్యుల కంట పడకుండా గుబురుచెట్ల మాటున దాకోవచ్చునని అతడు భావించాడు.

ఇంకా ఒడ్డు ఇరవై ముప్పై గజాల దూరం వుందనగా, చంద్రవర్మకు అల్లంత దూరంలో నీరు అల్లకల్లోలం అవటం కనబడింది.

ఆ వెంటనే పెద్దగా నోరు తెరిచిన ఒక మొసలి తోకతో నీటిని చిందరవందర చేస్తూ వేగంగా అతడికేసి రాసాగింది.

చంద్రవర్మ ఒక్క తృటికాలం స్తంభించిపోయాడు. శరీరం ఏదో పెద్ద రాయి కట్టినట్టు నీటి అడుగుకు గుంజుకు పోసాగింది.

మరుక్షణం అతడు భీతితో కెవ్వుమని కేకపెట్టి ఎక్కడలేని సత్తువా తెచ్చుకుని ఒడిసెల నుంచి విసిరిన రాయిలా దూసుకుంటూ పోయి ఒడ్డు మీద పడ్డాడు.

అతణ్ణి అప్పడం ముక్కలా నమిలి మింగదలచిన మొసలి కొంచెం ఆలస్యంగా ఒడ్డు చేరింది. కాని, యీలోపలే

మంటూ మునిగిపోయాడు. కొద్దిసేపటి తరవాత అతడు తెప్పరిల్లి నీటిపైకి లేస్తూ, సరస్సుకేసి కలయ చూసేసరికి చిన్నా పెద్ద మొసళ్ళు కొన్ని చెల్లా చెదరుగా యీదుకుంటూ దూరంగా పారిపోవటం కనిపించింది.

ఇదీ ఒక విధంగా నా మేలుకే జరిగింది, అనుకున్నాడు చంద్రవర్మ. గండభేరుండ పక్షులను చూసిన భయంలో మొసళ్లు ఆ ప్రాంతాన్నుంచి పారిపోతున్నవి. అలా కాకపోతే యీసరికి అవి తనను చుట్టుముట్టి, చెయ్యీ, కాలూ, తలా దొరకపుచ్చుకుని తన శరీరాన్ని ఛిన్నాభిన్నం చేసి వుండేవి.

చంద్రవర్మ నీటిలో నుంచి లేచి గుబురు చెట్లలోకి పరిగెత్తాడు. మొసలి అతడు పరిగెత్తిన వైపుకే కోరలు చాస్తూ కొంచెం సేపు చూసి, నిరాశతో తలను నీటముంచి యీదుకుంటూ సరస్సు మధ్యకు వెళ్ళి పోయింది.




చంద్రవర్మ ఆయాసంతో రొప్పుతూ ఒక చెట్టు బోదెకు ఆనుకుని కొంచెంసేపు విశ్రమించాడు. తరవాత అతడికి తన కత్తి సంగతి గుర్తుకొచ్చింది. గండభేరుండ పక్షి మీది నుంచి సరస్సులోకి పడిపోయి నప్పుడు, తను దానిని పోగొట్టుకున్నానేమో అని అతడు భయపడ్డాడు. ఆ వెంటనే అతడు తన ఒరకేసి చూసుకున్నాడు. ఒర నుంచి కత్తి కొంచెం బయటికి వచ్చి వున్నది. చంద్రవర్మ కత్తిని బయటికి లాగి ఒరలో చేరిన నీటిని కింద పార పోసి, తృప్తిగా కత్తిని తిరిగీ ఒరలో పెట్టాడు.

"ఇంతవరకూ నేను అదృష్టవంతుణ్ణే. నూరు యోజనాల దూరం మార్గప్రయాస లేకుండా అధిగమించగలిగాను. సరస్సులో పడి మొసళ్ళకు ఆహారం కాకుండా బయటపడ్డాను. ఆత్మరక్షణకు ఉపకరించే ఒకే ఒక ఆయుధం—నా కత్తిని జారవిడుచుకోలేదు. ఇక యిప్పుడు కర్తవ్యం?" అనుకుంటూ చంద్రవర్మ లేచి నిలబడి కొంచెం దూరం నడిచి గుబురు చెట్లను జాగ్రత్తగా పక్కకు వత్తిగించి దృష్టిని ముందుకు సారించాడు. ఎదురుగా—బహు సమీపంలో ఒక ఎత్తయిన కొండ. ఆ కొండ శిఖరం మొన తేలినట్టు, బొంగరం ముక్కులా వున్నది. అది అక్కడినుంచి దిగువకు కొంచెం కొంచెమే పరుచుకుపోతూ, సమ తలాన్ని చేరేసరికి చాలా వెడల్పుగా తయారైంది. దూరం నుంచి చూస్తే ఆ కొండ తలకిందులుగా పెట్టిన బొంగరంలా కనబడుతున్నది.

"ఇది మాంత్రికుడైన శంఖుడు వుండే కొండ. నేను దాని దాపులకు చేరాను.



నప్పుడు, అతణ్ణి బాధించిన సమస్య ఒక్కటే—అది నూరు యోజనాలు నడిచి ఆ కొండను చేరటం ఎలానా అని. కాని, తీరా యిప్పుడు ఆ కొండను చేరింతరవాత, ఆ శంఖాన్ని చేజిక్కించుకోవటం ఎలా సాధ్యమవుతుందా అన్న సమస్య అతణ్ణి బాగా కలవరపరచసాగింది.

చంద్రవర్మ యిలాంటి తెగని సమస్యలతో కిందుమీదవుతుండగా హఠాత్తుగా అతడి కర్ణపుటాలు బద్దలయేలా పెద్ద కేక వినబడింది. చంద్రవర్మ ఉలిక్కిపడ్డాడు. అంతలో భీతికొల్పే ఆ కేక మరోసారి వినిపించింది. ఈసారి చంద్రవర్మ ఆ కేక ఎవరిదో గుర్తించాడు. ఆ చుట్టుపక్కల వున్న చెట్లగుంపుల్లో నుంచే ఆ కేక వినవస్తున్నది. అది అగ్నిపక్షి వేసే కేక. గత రాత్రి అది గండభేరుండ పక్షులతో మంతనాలాడి తీరా ఎగిరిపోయే ముందు అలాగే కేక పెట్టింది.

నాక్కావలసింది ఆ మాంత్రికుడి పూజా గృహంలో వున్న అపూర్వశక్తులు గల శంఖం. ఆ శంఖం ఒక నాగుబాము మెడలో వేలాడుతూ వుంటుంది. ఆ నాగుబాము గోడకు వున్న ఒక మేకుకు వేలాడుతూ వుంటుంది. నేను ఆ శంఖాన్ని తస్కరించి తీసుకుపోయి కాపాలినికి యివ్వాలి. భేష్, యింతవరకూ అంతా స్వవ్యంగానే వున్నది. ఆ శంఖాన్ని చేజిక్కించుకోవటం ఎలా?''

చంద్రవర్మ యీ విధంగా లోలో కొంతసేపు మథనపడి పెద్దగా నిట్టూర్చాడు. కాపాలినికి మాట యిచ్చి అతడు శంఖుడు వుండే కొండ ప్రాంతానికి బయలుదేరి

ఇప్పుడు తను మాంత్రికుడైన శంఖుడి నివాస ప్రాంతాల వున్నాననీ, అతడి సేవకుల నుంచి గానీ, లేక అతడినుంచి గానీ తనకు కీడు కలిగే అవకాశం వున్నదనీ చంద్రవర్మ గ్రహించాడు. ఆ వెంటనే అతడికి అగ్నిపక్షికి పగటివేళ కళ్ళు కనబడవన్న సంగతి గుర్తుకొచ్చింది. అందువల్ల తనకు దాని నుంచి ప్రమాదం వచ్చే

అవకాశం లేదు. కాని, శంఖుడి యితర భృత్యుల మాటేమిటి?

చంద్రవర్మ యిలాంటి భయాలతో కొంచెంసేపు బాధపడి, చివరకు ఒక విధమైన మొండిధైర్యం తెచ్చుకున్నాడు. తను తగిన జాగరూకతతో వుండటం తప్ప, ఎప్పుడో రానున్న ప్రమాదాన్ని గురించి యిప్పటి నుంచే దిగులుపడటం వృథా అని తేల్చుకున్నాడు. ఆ వెంటనే అతడి మనసులో ఎక్కడలేని ధీమా, శరీరంలో ఎక్కడలేని సత్తువా, ఉత్సాహం పరవళ్ళు తీసింది.

చంద్రవర్మ తను వున్న తోటలో అక్కడా యిక్కడా వెతికి తనకు నచ్చిన పండ్లూ ఫలాలూ కావలసినన్ని కోసుకు తిని, సరస్సులోకి ప్రవహిస్తున్న ఒక సెలయేటిలో తియ్యని నీరు తాగాడు. తరవాత అతడు గుబురుగా వున్న ఒక చెట్టు మీదికి ఎక్కి ఆ కొమ్మలా రెమ్మల చాటున తృప్తిగా పడుకుని, ఎప్పుడు చీకటి పడుతుందా అని ఆదుర్దాగా ఎదురు చూడసాగాడు. చీకటి పడిన తరవాత మాత్రమే తను శంఖుడు వుండే కొండ ఎక్కటం క్షేమకరమని అతడు నిర్ణయించుకున్నాడు.

ప్రయాణ బడలికవల్లా, మితిమీరిన ఆదుర్దావల్లా చంద్రవర్మకు కొద్దిసేపటికే చెట్టుకొమ్మల్లో నిద్ర పట్టిపోయింది. సూర్యుడు ఆకాశం మధ్యకు వచ్చినప్పుడు కూడా వత్తుగా వున్న చెట్టు



ఆకుల చాటున వుండటంవల్ల అతడి మీద ఎండ పొడ పడలేదు. ఆ కారణంవల్ల సూర్యాస్తమయమై క్రమంగా చీకటి కమ్ముకున్నా, అతడు యింకా మైమరిచి నిద్రపోతూనే వున్నాడు.

హఠాత్తుగా ఒక రాత్రివేళ చంద్రవర్మ ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. చుట్టూ కటిక చీకటి. సమీపంలోని సరస్సు నుంచి చిన్న చిన్న ధ్వనులు వినిపిస్తున్నవి. గాలి తాకిడికి తోటలోని చెట్లకొమ్మలు ఒకదాని కొకటి ఒరుసుకుని కిర్రుకిర్రుమంటూ శబ్దిస్తున్నవి. ఎక్కడా మనుష్య సంచారం లేదు.

"బాగా పొద్దుపోయినట్టున్నది. ఇదే మంచి అదను. ఇక ఒకక్షణం కూడా ఆలస్యం చేయకుండా కొండ ఎక్కి శంఖుడి మంత్రగృహం సంగతేమిటో తేల్చుకుంటాను," అనుకుంటూ చంద్రవర్మ చెట్టు మీది నుంచి దిగి ఒకసారి ఒళ్ళు విరుచుకుని, ఒరలోని కత్తికేసి ఓమారు చూసుకుని బయలుదేరాడు.

చంద్రవర్మ చీకటిలో నేలబారుగా వున్న చెట్లకొమ్మలనూ, చిన్న చిన్న పొదలనూ జాగ్రత్తగా తప్పుకుంటూ కొండకేసి కొంతదూరం నడిచాడు. అతడి కళ్ళు ఆ గాఢాంధకారంలో అగ్నిపక్షి కోసం వెతుకుతున్నవి. తనకు ముందుగా రానున్న ప్రమాదం దానినుంచే అని అతడి కెందుకనో అనుమానంగా వున్నది. ఆ పక్షిగాని ఈ సమయంలో, ఆ చాయల లేకుండా వుంటే, తను సురక్షితంగా శంఖుడి మంత్ర గృహంలో ప్రవేశించగలనన్న నమ్మకం అతడికి కలిగింది.

చంద్రవర్మ కొండ అడుగును సమీపించబోతున్నంతలో, అతడికి దాపులనే వున్న ఒక ప్రదేశం నుంచి చిన్న మూలుగూ, ఆ వెంటనే, "వర్మా!" అన్న సన్నని పిలుపూ వినిపించినై.

చంద్రవర్మ ఆ గొంతు ఎవరిదో చప్పున గ్రహించాడు. అతడు, "కాపాలినీ!" అంటూ ఆ పిలుపు వచ్చిన వైపుకు వేగంగా నడిచాడు. —(ఇంకా వుంది)






# వరపరీక్ష

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అపరాత్రివేళ నువ్వు యింతగా శ్రమ పడుతున్నది, నీ స్వార్థం కోసమా, లేక పరోపకారం కోసమా అన్న అనుమానం కలుగుతున్నది. ఒకవేళ స్వార్థం కోసమే అయితే, దక్కినఫలాన్ని కృతవర్మ లాగా యితరులపరం చెయ్యకు. నీకు శ్రమ తెలియకుండా వుండేందుకు, అతడి కథ చెబుతాను, విను," అంటూ యిలా చెప్ప సాగాడు:

స్వర్ణపురరాజు కృతవర్మ యువకుడు. ఆయన ఒకసారి వేటకు వెళ్ళి, అరణ్యంలో దారితప్పాడు. కొంతసేపటికి ఆయనకు విపరీతంగా దాహం వేసింది. ఆ సమ

## బేతాళ కథలు



యంలో ఒక కోయయువతి కృతవర్మ కంటబడింది. ఆమె అపురూప సౌందర్యవతి. ఆమె అందాన్ని చూసి దాహం సంగతి మరిచిపోయి, కృతవర్మ ఆమె కేసి చూస్తూ వుండిపోయాడు. ఆమె కూడా ఆయన కేసి చూస్తూ నిలబడిపోయింది.

కొంతసేపటికి కృతవర్మ తేరుకుని, దాహం అని కోయయువతికి సైగచేసి చెప్పాడు. ఆమె వెళ్ళి, ఒక తామరాకు దొన్నెలో నీళ్ళతోపాటు తండ్రిని కూడా వెంటబెట్టుకు వచ్చింది.

కృతవర్మ మంచినీళ్ళు తాగేవరకూ ఆగి, కోయపిల్ల తండ్రి ఆయననను గురించిన వివరాలడిగాడు. రాజు తనను గురించి చెప్పుకుని, "నేనీపిల్లను ప్రేమించాను. నువ్వొప్పుకుంటే పెళ్ళి చేసుకుని, నా రాజ్యానికి తీసుకువెళతాను. ఈమె దేశానికి రాణి అవుతుంది," అన్నాడు.

దానికి కోయపిల్ల తండ్రి, "నేను కోయ రాజును. నా కూతురును వివాహమాడిన వాడు, యిక్కడే వుండి కోయరాజ్యాన్నేలుకోవాలి," అన్నాడు.

రాజుకు నిరాశకలిగింది. కోయపిల్ల కోసం నాగరకప్రపంచాన్ని వదులుకుని, ఈ ఆటవికులమధ్య జీవించలేడు.

ఇప్పుడేం చేయడమా అని కృతవర్మ ఆలోచిస్తూండగా, కోయపిల్ల తండ్రితో, "నాన్నా, నేనొక్కసారి, యీ రాజుతో మాట్లాడతాను," అన్నది.

తండ్రి సరేనన్న మీదట ఆమె, రాజును కొంచెం దూరంగా తీసుకుపోయి, "నువ్వీ పెళ్ళికి ఒప్పుకో. ఒకసారి కోయ రాజువైనాక, నువ్విక్కడ మరొక రాజును నియామకం చేసి, నన్ను నీ రాజ్యానికి తీసుకుపోవచ్చు," అని చెప్పింది.

కోయపిల్ల కూడా తనను ప్రేమిస్తున్నదన్న నమ్మకం కలిగింది, రాజుకు. ఆయన ఆమె తండ్రికి తాను పెళ్ళికి సిద్ధం అని చెప్పాడు.

"అయితే, వరపరీక్షకేర్పాట్లు చేస్తాను!" అన్నాడు కోయరాజు.

''వరపరీక్ష ఏమిటి?'' అన్నాడు కృత వర్మ ఆశ్చర్యపోతూ.

కోయపిల్లను పెళ్ళాడదలచిన యువకులమధ్య మల్లయుద్ధపోటీలు జరుగుతవి. వాటిలో అందర్నీ జయించినవాడినే, కోయపిల్ల పెళ్ళాడుతుంది. ఇందుకు కృతవర్మ అంగీకరించాడు.

మర్నాడే పోటీలు జరిగినవి. రాజుతో కలిపి కోయపిల్లను పెళ్ళాడడానికి వచ్చిన వాళ్ళు పన్నెండుగురు. కోయరాజు వారిని రెండు వేర్వేరు వర్గాలుగా విభజించాడు. కృతవర్మ తన వర్గంలో వారినందరినీ ఓడించాడు. అవతలి వర్గంలో దీపు డనేవాడు, తక్కిన యువకులందరినీ ఓడించాడు. అప్పుడు పోటీ దీపుడికీ, కృత వర్మకూ జరిగింది.

మల్లవిద్యలో దీపుడికి చాలా మెలుకువలు తెలుసు. వాడు కృతవర్మను తేలిగ్గా ఓడించాడు. రాజు ఓడిపోగానే, కోయపిల్ల చప్పట్లుకొట్టి, దీపుణ్ణి అభినందించింది. కృతవర్మకు యిది చాలా అవమానంగా తోచింది.

అయితే, కోయపిల్ల కొంతసేపు తరవాత కృతవర్మను ఒంటరిగా చూడవచ్చి, ''నీవు ఒక దేశానికి రాజునంటున్నావు. సైన్యంతో యిక్కడికి తిరిగి వచ్చి, నన్ను తీసుకుపోలేవా?'' అని అడిగింది.



ఆయన అప్పటికప్పుడే తిరిగి తన రాజ్యంచేరుకుని ఆస్థానమల్లుణ్ణి పిలిపించి, ''ఇంతవరకూ నేను నేర్చిన ప్రతి విద్యలోనూ అద్వితీయుణ్ణనిపించుకున్నాను. మల్లవిద్య నొక్కదాన్నే అశ్రద్ధ చేశాను. ఈ విద్యలో నా అంతటివాడు మరొకడుండడన్న విధంగా, నువ్వు నాకు శిక్షణ యివ్వాలి!'' అని చెప్పాడు.

ఆస్థాన మల్లుడు సరేనన్నాడు. కృత వర్మ పట్టుదలతో ఒక మాసం రోజుల్లో మల్లవిద్యను క్షుణ్ణంగా అభ్యసించాడు. తరవాత ఆయన రెండు వందలమంది సైనికులను వెంటబెట్టుకుని, కోయరాజు దగ్గిరకు వెళ్ళి, అతడితో, ''కావాలంటే



అందుకు కోయపిల్ల దీనంగా, "నేను దీపుణ్ణి ప్రేమిస్తున్నాను. మల్లవిద్యలో వాడు, నిన్నోడించగలడని, నాకు తెలుసు. వాడి గొప్పతనాన్ని ఒక దేశపు రాజు కూడా గుర్తించాలనే, అప్పుడు నిన్ను వరపరీక్షకు ప్రోత్సహించాను. అప్పుడంతా నేననుకున్నట్టే జరిగింది," అన్నది.

"అయితే, మరి నన్ను సైన్యంతో వచ్చి, నిన్నెత్తుకు పొమ్మని ఎందుకు సలహా యిచ్చావు?" అన్నాడు కృతవర్మ.

కోయపిల్ల కొంచెంసేపు మౌనంగా పూరుకుని, తరవాత, "ఒక దేశపు రాజు నన్ను ప్రేమించి, నా కోసం సైన్యంతో వస్తే, అది నాకెంతో గర్వ కారణం. ఆయన నన్ను తన దేశానికి రాణిని చేస్తానంటే, అదింకా గర్వకారణం. అయినా, నేను దీపుడితోనే వుండిపోతానంటే, నా ప్రేమ ఎంత గొప్పదో దీపుడు తెలుసుకుంటాడు. కాని, వరపరీక్షలో నువ్వు జయించి, నా ఆశ అడియాస చేశావు," అన్నది.

కృతవర్మ వెంటనే కోయరాజుతో, "నువ్వు, నీ కూతురి పెళ్ళి దీపుడితో జరిపించు. నీ రాజ్యానికెప్పుడే కష్టం వచ్చినా, నేనాదుకుంటాను," అన్నాడు.

"మీరు వరపరీక్షలో నెగ్గారు. మా సంప్రదాయం ప్రకారం, మీరే దాన్ని పెళ్ళాడాలి," అన్నాడు కోయరాజు.

నేను బలవంతంగా నీ కూతురును తీసుకుపోగలను; కాని అలా చేయను. తిరిగి వరపరీక్షకు ఏర్పాట్లు చెయ్యి," అన్నాడు.

కోయరాజు వెంటనే పోటీ ఏర్పాటు చేశాడు. ఈసారి పోటీలో రాజు, దీపుడిని అవలీలగా ఓడించాడు.

దీపుడు ఓడిపోగానే కోయపిల్లముఖంలో దిగులు కనిపించింది. కృతవర్మ ఆమెను, "గతంలో నేను ఓడిపోతే చప్పట్లు చరిచి వినోదించావు. అప్పుడు నేను, నీకు వీరుల నభినందించడం అలవాటనుకున్నాను. ఇప్పుడు దీపుడు ఓడిపోతే అంత దిగులు పడిపోతున్నావేం?" అని అడిగాడు.

కృతవర్మ నవ్వి, "వరపరీక్ష ఎప్పుడో జరిగిపోయింది; అప్పుడు నేనోడి పోయాను. ఆడపిల్లకు వరపరీక్ష ఒక్కసారి మాత్రమే!" అని రాజధానికి వెళ్ళాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కృతవర్మ వరపరీక్షలో నెగ్గి కూడా, కోయ పిల్లను ఎందుకు వివాహం ఆడలేదు? అతడు దీపుణ్ణి ఓడించి కోయపిల్లను వివాహం ఆడేందుకేగదా నగరానికి తిరిగి పోయి మల్లవిద్యలో మరికొన్ని మెలుకువలు తెలుసుకువచ్చాడు? అయినా అతడు బుద్ధి మార్చుకోవడానికి కారణం ఏమిటి? ఇందుకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వరపరీక్ష అనేది ఒకేసారి జరుగుతుంది. రెండు సార్లు జరగడం అనేది అనుచితం, అసందర్భం. ఈ సంగతి కృతవర్మ, కోయ పిల్ల తండ్రికి చెప్పాడు కూడా. రాజైన వాడు, ఒక కోయయువకుడి చేతిలో ఓటమి పొందడం అనేది చాలా అవమానకరం అయిన సంగతి. అందుకే కృతవర్మ మల్లవిద్యను మరింత పట్టుదలగా అభ్యసించి, కోయయువకుడితో మరొకసారి పోటీపడ్డాడు. ఈ రెండవసారి అతడు వచ్చింది వరపరీక్షకు కాదు; బలపరీక్షకు! ఈ సంగతి కృతవర్మ ముందుగా కోయ పిల్ల తండ్రికి చెప్పకపోవడానికి తగు కారణం వున్నది. కోయయువకుడు తాను ప్రేమించిన యువతికోసం, రాజుతో మల్లయుద్ధానికి సిద్ధపడ్డాడేతప్ప, తాను అతడి కంటె బలవంతుణ్ణని రుజువు చేసుకోవడానికికాదు. ఈ కారణం వల్ల, రాజు కేవలం బలప్రదర్శనకోసమే వచ్చాడని తెలిస్తే, అతడు విజయం కోసం పట్టుదలగా పోరాడకపోవచ్చు. అందువల్ల కృతవర్మ దక్కిన ఫలాన్ని యితరులపరం చేశాడనడం నిజం కాదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)





# టెంకాయ దొంగ

ఒక గ్రామంలో పెదరామయ్య అనే భూస్వామి సిద్ధిగాడనే వాణ్ణి నాలుగు రూపాయల నెల జీతంమీద తోటమాలిగా పెట్టుకుని, వాడిచేత తోట వేయించాడు. అందులో అరటి చెట్లూ, మామిడి చెట్లూ, కొన్ని కొబ్బరిచెట్లూ నాటాడు. కూరగాయిలు కూడా వేశారు.

కాలక్రమాన తోట పెరిగి వచ్చింది. తన జీతం కాస్త పెంచమని సిద్ధిగాడు భూస్వామిని అడిగాడు.

''అప్పుడేనా? అంత తొందరపడకు. కొబ్బరిచెట్టు కాపుకు రానీ చూద్దాం,'' అన్నాడు పెదరామయ్య.

కొబ్బరి చెట్లకు కూడా గెలలు పడ్డాయి. తన జీతం మరి రెండు రూపాయలైనా పెంచితీరాలని సిద్ధిగాడు పట్టుబట్టాడు.

''పోరా పో! ఇప్పుడు నీకు తోట పని ఏమంత ఉన్నదని? నీ జీతం ఒక్క దమ్మిడీ కూడా పెంచను. ఇష్టముంటే ఉండు, లేకపోతే పని మానేసి వెళ్ళిపో,'' అన్నాడు యజమాని.

సిద్ధిగాడు చిక్కులో పడ్డాడు. వాడు తోటకు చెయ్యావలసినదంతా అదివరకే చేశాడు. ఇక చెయ్యావలసిన కష్టమైన పని ఏదీ లేదు. ఆ సంగతి తెలిసే యజమాని అంత ధీమాగా ఉన్నాడు. ఇంతకాలమూ ఒళ్ళు దాచుకోకుండా, న్యాయంగా పని చేసిన సిద్ధిగాడు ఇకనుంచీ దొంగతనానికి దిగదలిచాడు.

వాడు ప్రతి రాత్రీ తోట నుంచి రెండేసి టెంకాయలు దొంగతనం చేస్తూ వచ్చాడు. మూడు రోజులు గడిచేసరికల్లా పెదరామయ్యకు కొబ్బరికాయలు పోతున్నట్టు ఆచూకీ తెలిసింది. కాని దొంగ ఎవరో తెలియలేదు. ఆయన సిద్ధిగాణ్ణే అడిగి చూశాడు. కొబ్బరికాయలు పోతున్నాయని

గాని, దొంగ ఫలానా అని గాని తనకు తెలియదన్నాడు సిద్ధిగాడు.

"సరే, రాత్రిపూట తోటలో కాపలా ఉండి దొంగను పట్టుకో," అన్నాడు యజమాని.

"రెండు రూపాయలు జీతం పెంచండి, అలాగే రాత్రింబవళ్లు కూడా కాపలా వుండి దొంగను పట్టుకుని మీకు ఒప్పజెబుతాను," అన్నాడు సిద్ధిగాడు.

"అదేమీ కుదరదు. నేనే కాపలా ఉంటాలే," అని పెదరామయ్య అప్పటి కప్పుడే గ్రామదేవత గుడికి వెళ్ళి, "తల్లీ, టెంకాయ దొంగను ఈ రాత్రి నా కంట పడేస్తివా నీ కొక మేక నిస్తాను," అని దణ్ణం పెట్టుకున్నాడు.

తాను కూడా దేవతకు దణ్ణం పెట్టుకోవటానికి వచ్చిన సిద్ధిగాడు ఈ మాటవిన్నాడు.

యజమాని వెళ్ళిపోయాక సిద్ధిగాడు దేవతతో, "తల్లీ, నన్ను యజమాని చేతికి చిక్కకుండా తప్పించావంటే రేపు నీ కొక పుంజు నిస్తా. అంతకు మించి నాకు శక్తి లేదు," అని దణ్ణం పెట్టుకున్నాడు.

ఆనాడు అర్ధరాత్రివేళ సిద్ధిగాడు తోటలో ప్రవేశించి, బావి పక్కన ఉన్న కొబ్బరి చెట్టెక్కి, ఒక కాయ కోసి దూరంగా విసిరి వేశాడు. యజమాని తోటలో పొంచి ఉన్న పక్షంలో, కాయ పడిన చోటనే దొంగకోసం చూస్తాడని వా డలా చేశాడు.

కాని పెదరామయ్య అంతకు ముందే, బావి పక్కనున్న చెట్టు మీదికి ఎవరో



ఎక్కటం కనిపెట్టి, కర్రా తాడూ తీసుకుని ఆ చెట్టు కిందికే వచ్చి, "ఎవడ్రా చెట్టు మీద? దొంగ వెధవా! నన్నే మోసం చేద్దామనుకున్నావా? కిందికి దిగి రారా! నిన్ను చెట్టుకు కట్టి చర్మం వొలిచేస్తాను!" అని గద్దించాడు.

సిద్ధిగాడు భయంతో వణికిపోతూ చెట్టు మీదనే కదలకుండా ఉండిపోయాడు. అంతలోనే ఎవరో ఆ చెట్టు మీది నుంచే బావిలోకి దభీమని దూకటం పెదరామయ్య కంటపడింది.

ఆ మరుక్షణం అతను వెంట తెచ్చిన కర్రా, తాడూ బావిపక్కన పెట్టి, "ఒరే, దొంగవెధవా! బావిలోకి దూకి, నాకు అందకుండా తప్పించుకుపోవాలనుకున్నావా? నేనీ చుట్టుపక్కల ఏడేడు పధ్నాలుగు గ్రామాల్లో పేరుమోసిన గజయీతగాణ్ణి," అంటూ బావిలోకి దూకి దొంగకోసం వెతకసాగాడు. ఎవరిదో తల అతని చేతికి తగిలింది గాని, ఎంత ప్రయత్నించినా పట్టు చిక్కలేదు.

కొంతసేపయాక ఆ బావిలో దూకిన వ్యక్తి రామయ్యను ఒక తన్ను తన్ని, చివాలున బావిలో నుంచి పైకెగిరి, తప్పించుకు పోయాడు.

దొంగ లాఘవం చూస్తే రామయ్యకు చాలా ఆశ్చర్యమయింది.

మర్నాడు పెదరామయ్య గ్రామదేవత గుడికి వెళ్ళి, "తల్లీ, నన్ను మోసగించావు. దొంగ తప్పించుకు పోయాడు. నేను నీకు మేక నివ్వను," అన్నాడు.

"దొంగను కళ్ళ చూపమన్నావు, చూపాను. నీ పనివాడికి రెండు రూపాయలు జీతం పెంచలేని పిసినిగొట్టువు, నాకు మేక నిస్తావా? ఆ మాట నన్ను నమ్మమంటావా? సిద్ధిగాడి జీతం పెంచితే నీకీ కష్టాలే రాకపోను గద!" అన్నది దేవత పూజారికి పూని.

పెదరామయ్యకు జ్ఞానోదయమయింది. ఆయన ఆరోజే సిద్ధిగాడికి జీతం పెంచాడు. తరవాత తోటలో టెంకాయ దొంగతనాలు జరగలేదు.






కేశవగుప్తుడనే వ్యాపారి దీర్ఘవ్యాధితో బాధపడుతున్న సమయంలో, ఆయన వద్ద పని చేసేవాళ్ళు తప్పుడు లెక్కలతో మోసం చేసి, ఆయన ఆస్తినంతా హరించి వేశారు. వ్యాధినివారణ కోసం ఆయన వైద్యులకూ, మందులకూ ఇంట్లో వున్న విలువైన వస్తువులూ, భార్య నగలూ అమ్మవలసి వచ్చింది. కొంతకాలానికి ఆయన వ్యాధి నుంచి కోలుకున్నాడు గాని, కటిక దరిద్రుడైపోయాడు.

అంత దీనస్థితిలో కూడా కేశవగుప్తుడు అధైర్యపడక, ఎవరివద్దనైనా ఒక వంద వరహాలు అప్పు తీసుకుని, తిరిగి ఏదైనా చిన్న వ్యాపారం ప్రారంభించదలిచాడు. అందుకోసం ఆయన జగదీపుడనే తన చిన్ననాటి స్నేహితుడి దగ్గిరకు వెళ్ళాడు.

జగదీపుడు ఆయనకు మామూలు మర్యాదలు చేసి, సంగతి తెలుసుకుని, ''కొబ్బరి చెట్టెక్కి కాయలు దించేవాడికీ, వ్యాపారికీ చాలా పోలికలున్నవి. ఒకసారి వాడు చెట్టు మీది నుంచి పడితే, తిరిగి చెట్టెక్క ప్రయత్నం చెయ్యడు—మరేదైనా వృత్తి చూసుకుంటాడు,'' అన్నాడు.

జగదీపుడు చెప్పదలిచినదేమిటో అర్థం చేసుకున్న కేశవగుప్తుడు వచ్చే కోపాన్ని అపుకుంటూ, ''ప్రమాదం జరిగిందని భయపడి, నేర్చిన వృత్తిని విసర్జించి, తెలియని మరి దేనికోసమో పాకులాడే వాడు పరమభీరువు. పోలికలంటూ తెచ్చావు గనక చెబుతున్నాను. నేనే చెట్లెక్కేవాడినైతే, ఒకసారి ప్రమాదం జరిగాక, మరింతజాగ్రత్తగా వుంటాను. వ్యాపారినైతే, పనివాళ్ళ విషయంలో ముందుగానే శ్రద్ధ వహిస్తాను,'' అన్నాడు.

ఆ జవాబు జగదీపుడికి చురుక్కుమనిపించినా లేని నవ్వు తెచ్చుకుని,

రాంబాబు




''బాగా చెప్పావు, కేశవా! ఏమైనా యిప్పటి నా వ్యాపారస్థితి ఏమంత బాగా లేదు. ఒక వైపున, నేను బాకీపడ్డవాళ్ళ నుంచి డబ్బు చెల్లించమని వత్తిడి వస్తున్నది. రెండోవైపున, నా దగ్గిర అప్పు తీసుకు పోయినవాళ్ళ నుంచి డబ్బు వసూలు కావడం లేదు. ఇలాంటి సంకటస్థితిలో వున్నాను. కనక వంద వరహాలు అప్పుగా యివ్వలేను. ఈ ఐదు వరహాలూ తీసుకు వెళ్ళు. తిరిగి చెల్లించనవసరం లేదులే!'' అన్నాడు.

దానితో కేశవగుప్తుడికి తన స్నేహితుడి నిజరూపం తెలిసిపోయింది. ఆయన జగదీపుడిచ్చిన ఐదు వరహాలూ తీసుకుని, మరి ముగ్గురు స్నేహితుల దగ్గిరకు వెళ్ళి సంగతి వివరించాడు.

ఆ స్నేహితులు కూడా తమ కష్ట సుఖాలు ఏకరువు పెట్టి, తలా ఐదు వరహాలూ తిరిగి యివ్వనవసరం లేదంటూ కేశవగుప్తుడికిచ్చారు.

ఇక తనకు వంద వరహాల అప్పు దొరకడం అసంభవం అనుకుంటూ, కేశవగుప్తుడు ఇంటికి తిరిగి వచ్చి, భార్యకు తన స్నేహితుల ప్రవర్తన గురించి చెప్పాడు.

జరిగినదానికి కేశవగుప్తుడి భార్య చాలా విచారించి, ''ఇంత పట్టణంలో, ఈ నలుగురేనా మీ స్నేహితులు! మీరు యిక్కడ పుట్టి పెరిగినవాళ్ళు. ఎంతో కాలంగా వ్యాపారం చేస్తున్నారు. స్నేహితులంటూ మరి లేరా?'' అని అడిగింది.

కేశవగుప్తుడు కొంచెంసేపు ఆలోచించి, పెద్దగా నిట్టూరుస్తూ, ''చిన్ననాటి స్నేహితులూ, వ్యాపారంలో లావాదేవీల ద్వారా స్నేహితులైనవాళ్ళూ, స్నేహితులవల్ల స్నేహితులైనవాళ్ళూ—ఇలా నలభై, యాభైమంది దాకా వుంటారు,'' అన్నాడు.

''అలా అయితే, వాళ్ళ పేర్లూ, షుమారుగా ఏ వీధిలో వుండేదీ ఒక కాయితం మీద రాసి యివ్వండి,'' అన్నది కేశవగుప్తుడి భార్య.

''అందువల్ల ప్రయోజనం ఏమిటి! ఇంతకూ నువ్వేం చేయాలనుకుంటున్నావు?'' అని అడిగాడు కేశవగుప్తుడు ఆశ్చర్యంగా.

''నేనేం చెయ్యను. ఆ చేసేదేమిటో మన అబ్బాయి హరిగుప్తుడు చేస్తాడు,'' అన్నది కేశవగుప్తుడి భార్య.

ఆ రాత్రి కేశవగుప్తుడు తన స్నేహితులందరి పేర్లూ గుర్తు తెచ్చుకుని, ఒక కాయితం మీద రాసి భార్య కిచ్చాడు. మర్నాటి ఉదయం ఆమె తన పధ్నాలుగేళ్ళ కొడుకు హరిగుప్తుడికి ఆ కాయితం యిచ్చి, ''నాయనా, నువ్వు యీ కాయితంలో పేర్లున్నవారిని కలుసుకుని, నాన్నగారు నూరు వరహాలు అప్పు అడిగారని చెప్పు. వారు యిస్తామంటే, నాన్నగారు వచ్చి తీసుకుంటారని తిరిగిరా,'' అని చెప్పింది.

ఆ సాయంత్రం హరిగుప్తుడు ఒక సంచీనిండు వరహాలతో ఇంటికి తిరిగి వచ్చాడు.

కేశవగుప్తుడు ఆశ్చర్యపోయి, ఏం జరిగిందని కొడుకు నడిగాడు.

''నాన్నా, నీ స్నేహితు లెవరి దగ్గిరా అప్పుగా యిచ్చేందుకు వంద వరహాలున్నట్టు లేదు. కాని, ప్రతి ఒక్కళ్ళూ, చితికిపోయిన మీ నాన్న తిరిగి వ్యాపారం ప్రారంభించి వృద్ధిలోకి రావాలంటూ ఐదూ, పదీ వరహాల చొప్పున యిచ్చారు. ఈ డబ్బు తిరిగి యివ్వనవసరం లేదన్నారు కూడా,'' అని చెప్పాడు హరిగుప్తుడు.

కేశవగుప్తుడు తన భార్య తెలివితేటలకు చాలా ఆనందించి మనసులో ఎంతగానో మెచ్చుకున్నాడు.

ఆయన హరిగుప్తుడు తెచ్చిన డబ్బు లెక్కించగా, నాలుగువందల వరహాలపై చిలుకు తేలింది.

ఆ డబ్బుతో కేశవగుప్తుడు చిన్న ఎత్తున వ్యాపారం ప్రారంభించి, ఐదారేళ్ళ కాలంలో తిరిగి తన పూర్వస్థితికి చేరుకున్నాడు.





# వైరాగ్యం

బ్రహ్మదత్తుడు కాశీ రాజ్యాన్ని పరిపాలించే కాలంలో విదేహ దేశానికి ముఖ్యపట్టణమైన మిథిలానగరంలో మహాజనకుడనే రాజు ఉండేవాడు. ఆయనకు అరిష్టజనకుడనీ, పోలజనకుడనీ ఇద్దరు కుమారులుండేవారు.

మహాజనకుడు పోయాక అరిష్టజనకుడు రాజ్యాభిషేకం చేసుకుని రాజై, తన తమ్ముడైన పోలజనకుణ్ణి యువరాజు చేశాడు. అయితే కొంతకాలానికి అరిష్టజనకుడికి తన తమ్ముడు తనను చంపి రాజు కావాలని చూస్తున్నట్టు నౌకర్ల ద్వారా రహస్యవార్తలు అందాయి. కాని అరిష్టజనకుడు వాటిని లక్ష్యపెట్టలేదు.

తన అన్న అలక్ష్యం ఆధారం చేసుకుని పోలజనకుడు కొంత పరివారాన్ని కూడగట్టుకుని, అన్నపై కుట్ర పన్ని, ఒకనాడు ఆయనపై తన సిబ్బందితో హఠాత్తుగా వెళ్ళిపడి ఆయనను హత్య చేసేశాడు.

అరిష్టజనకుడు చనిపోయే సమయానికి ఆయన పట్టపురాణి గర్భవతిగా ఉన్నది. భర్త చనిపోయిన వార్త వినగానే ఆమె తన నగలూ నాణ్యాలూ ఒక గంపలో పెట్టి, వాటిపైన ఊక కప్పింది. తరవాత ఆమె మాసిన బట్టలు కట్టుకుని, గంప నెత్తిన పెట్టుకుని బయలుదేరింది. దారిలో ఆమెనెవరూ గుర్తించలేదు. ఆమె ఉత్తర ద్వారంగుండా నగరం దాటి వచ్చేసింది.

ఎటు వెళ్ళాలో ఆమెకు తెలియదు; ఆమె ఎన్నడూ రాజసౌధం దాటి ఇవతలికి వచ్చిన మనిషి కాదు. కాలచంప అనే నగరం ఒకటి ఎక్కడో ఉన్నట్టు ఆమె విని ఉన్నది. అందుచేత ఆమె ఒక చెట్టు కింద తన గంప పెట్టుకు కూచుని, దారివెంట వచ్చేపోయేవారిని, ''కాలచంప

నగరానికి దారి ఎటు, నాయనా?'' అని అడగసాగింది. ఆమెకు ఎవరూ దారి చెప్పలేకపోయారు.

చిట్టచివరకు ఒక ముసలివాడు బండి తోలుకుంటూ అటుగా వచ్చాడు. వాడు రాణితో, ''నేను ఆ నగరానికే పోతు న్నాను. బండి ఎక్కి కూచో అమ్మా. నిండు చూలాలులాగా ఉన్నావు. బండి జాగ్రత్తగా, కుదుపు లేకుండా తోలుతాలే," అన్నాడు. రాణి ఆ బండిలో ఎక్కి కాల చంప నగరానికి చేరుకున్నది. బండివాడు ఆమెను గ్రామ చావడివద్ద దించి వెళ్ళి పోయాడు. ఇక ఎక్కడికి వెళ్ళాలో ఆమెకు తెలియదు. అందుచేత ఆమె ఆ గ్రామచావడిలో వెళ్ళి కూచుని, దాని ముందుగా నడిచే మనుషులను చూడ సాగింది.

కొంతసేపటికి ఒక బ్రాహ్మణుడు తన శిష్యులతో సహా స్నానానికి వెళుతూ చావడిలో కూర్చుని ఉన్న గర్భిణీ స్త్రీని చూశాడు. అయన తన శిష్యులను బయటనే ఉండమని, లోపలికి వచ్చి రాణిని పలకరించాడు.

''నాయనా, నేను మిథిలా నగరపు రాణిని. నా భర్త యుద్ధంలో చనిపోవటం వల్ల నేను దిక్కులేని అనాథనైపోయాను. నా కిప్పుడెవరూ లేరు. ఈ నగరంలో



నే నెవరినీ ఎరుగను,'' అన్నది రాణి బ్రాహ్మడితో.

''అలా అయితే నువు మా ఇంట తల దాచుకోవచ్చు. కాని ముందుగా ఒక చిన్న నాటకం ఆడాలి. నా కాళ్ళ మీద పడి, బయట ఉన్న నా శిష్యులు వినే టట్టు భోరుమని శోకాలు పెట్టు. నీ రహస్యం ఎవరికీ తెలియకుండా నిన్ను కాపాడుతాను,'' అన్నాడు బ్రాహ్మడు.

రాణి ఆయన చెప్పినట్టే చేసింది. ఎవరో స్త్రీ తమ గురువుగారి కాళ్ళ మీద పడి బావురుమనటం చూడగానే శిష్యులు ఆత్రంగా లోపలికి వచ్చి, ''ఏమిటి? ఏమిటి?'' అని ప్రశ్నించారు. దారే

పోయ్యే వారు కూడా చాలామంది చేరారు. బ్రాహ్మడు వారందరికీ ఈ విధంగా చెప్పాడు:

''ఇది నా కడకొట్టు చెల్లెలు. నేను స్వగ్రామం విడిచిపెట్టాక పుట్టింది. అందు చేత దీన్ని నేనింతకు పూర్వం ఎన్నడూ చూసి ఎరుగను.''

ఈ మాటలు అందరూ విశ్వసించారు. బ్రాహ్మడు ఆమెను తన ఇంటికి తీసుకుపోయి, చక్కగా స్నానం చేయించి, భోజనం పెట్టించాడు. కొద్దిరోజులకల్లా ఆమె ఒక మగ పిల్లవాణ్ణి కన్నది. ఆ పిల్లవాడి కామె మహాజనకుడని తన మామగారి పేరు పెట్టుకున్నది. ఈ మహాజనకుడే బోధిసత్వుడు.

మహాజనకుడు క్రమంగా పెరిగి పెద్దవాడు కాసాగాడు. అతనితో ఆడుకునే క్షత్రియ కుమారులు అతన్ని చులకనగా చూసేవాళ్ళు. ఇది చూసి మహాజనకుడు మండిపడి వాళ్ళను చితక తన్నేవాడు. వాళ్ళు ఏడుస్తూ వెళ్ళి తమ పెద్దవాళ్ళతో, ''ఆ విధవరాలి కొడుకు మమ్మల్ని తన్నాడు!'' అని చెప్పేవాళ్ళు.

''విధవరాలి కొడుకు'' అన్న మాట వినగానే మహాజనకుడికి తన తండ్రి ఎవరా అని సందేహం కలిగింది. మొదట్లో తల్లి అతనికి నిజం చెప్పలేదు. కాని మహాజనకుడు పట్టుబట్టటం చేత ఇక చేసేదిలేక ఆమె జరిగినదంతా కొడుకుకు చెప్పేసింది.



తన పినతండ్రి తన తండ్రితో యుద్ధం చేసి, యుద్ధంలో తన తండ్రిని చంపి విదేహ రాజ్యం వశపరచుకున్నాడని తెలియగానే, ఆ రాజ్యం తిరిగి సాధించా లన్న కోరిక మహాజనకుడికి మనసులో తల ఎత్తింది. పదహారేళ్ళు నిండగానే అతను తన చదువు సంధ్యలు ముగించి, తల్లితో, ''అమ్మా, నేను విదేహ రాజ్యాన్ని జయిస్తాను. నీ దగ్గిర సొమ్మేమైనా ఉన్నదా?'' అని అడిగాడు. ఆమె అతనికి తాను గంపలో దాచి మిథిలా నగరం నుంచి తెచ్చిన బంగారమూ, నగలూ చూపింది. అందులో సగం మాత్రమే తీసుకుని మహాజనకుడు మిథిలా నగ రానికి ప్రయాణమయాడు.

సరిగా ఆరోజే మిథిలా నగరంలో పోల జనక మహారాజుకు ఒక చెయ్యీ, కాలూ పడి పోయింది. సరిగా మహాజనకుడు మిథిలా నగరంలో అడుగు పెట్టిననాడే రాజభవ నంలో పోలజనకుడు మరణించాడు.

అయనకు వారసులెవరూ లేరు. రాజ పురోహితుడు ఒక రథం మీద రాజ కిరీటమూ, రాజఛత్రమూ, రాజదండమూ, పాదుకలూ మొదలైనవి పెట్టి రథాన్ని యథేచ్ఛగా పోనిచ్చాడు. పురోహితుడూ మంత్రులూ రథం వెనక నడుస్తూ బయలుదేరారు.

రథం కొంతదూరం వెళ్ళి ఉద్యాన వనంలో మహాజనకుడు విశ్రాంతి తీసు కుంటున్న చోట ఆగిపోయింది.



రాజపురోహితుడు మహాజనకుణ్ణి పరీక్షించి, అతని శరీరంపైన రాజలక్షణాలుండటం గమనించి, విదేహ దేశానికి అతనిని రాజుగా ప్రకటించాడు. అతనికి పట్టాభిషేకం జరిగింది. తరవాత మహాజనకుడు సీవలీదేవిని పెళ్ళాడి, సుఖంగా రాజ్యం చేయసాగాడు. వారికి దీర్ఘాయువు అని ఒక కుమారుడు కూడా కలిగాడు.

కొంతకాలం గడిచింది. ఒకరోజు మహాజనకుడికి తోటలు చూడాలని వేడుక కలిగింది. ఆయన తన ఏనుగు నెక్కి తోటలు చూడటానికి బయలుదేరాడు. తోటలోకి ప్రవేశిస్తూనే ఆయన రెండు అందమైన గున్నమామిడిచెట్లను చూశాడు. అవి గుబురుగా, నవనవలాడుతూ ఉన్నాయి. వాటిలో ఒక చెట్టు నిండా పళ్ళున్నాయి. రెండవ చెట్టుమీద ఒక్క పండు కూడా లేదు. పళ్ళున్న చెట్టు నుంచి ఒక పండు కోయించుకొని తిని, అది చాలా రుచిగా ఉండటంచేత రాజుగారు, తిరిగి వచ్చేటప్పుడు మరి కొన్ని పళ్ళు తిందామని తన మనసులో అనుకున్నాడు.

ఆయన ముందుకు సాగి వెళ్ళగానే రాజుగారి పరివారంలో వారంతా ఆత్రంగా మామిడిపళ్ళు కోసుకుని తిన్నారు. కొందరు తొందరలో కొమ్మలు కూడా విరిచారు. ఎంతో అందంగా ఉండిన గున్నమామిడి కొద్ది క్షణాలలో బీభత్సంగా అయిపోయింది.

రాజుగారు తోటలన్నీ కలియతిరిగి, తిరిగివస్తూ పాడుపడిపోయిన మామిడిపళ్ళ-చెట్టును చూసి నిర్ఘాంతపోయాడు. దానిపక్కనే ఉన్న గొడ్డుమామిడి చెట్టు ఎప్పటిలాగే నవనవలాడుతూ ఉంది.

''ఇది నా కొక గుణపాఠం. రాజ్య వైభవమంతా ఈ పళ్ళచెట్టులాటిది. సన్యాసం గొడ్డుచెట్టులాటిది. దీని జోలికి ఎవరూ రారు. ఈ వైభవమంతా విడిచి పెట్టి నేను సన్యాసం పుచ్చుకుంటాను!'' అనుకున్నాడు మహాజనకుడు.

—[ముగింపు వచ్చే సంచికలో]






మన నదులు :

# విపాశ

కల్మాషపాదు డనే రాజు ఒకనాడు అరణ్యమార్గం గుండా గుర్రం మీద వెళుతున్నాడు. ఆ మార్గం చాలా ఇరుకుగా ఉన్నది. అప్పుడు శక్తి అనే ఒక ముని కుమారుడు అతనికి ఎదురుగా వచ్చాడు. రాజు అతన్ని పక్కకు తప్పుకుని తనకు దారి ఇమ్మన్నాడు.

"సాధువుల సమక్షంలో వినయ విధేయతలు చూపవలసింది రాజుల బాధ్యత. అందువల్ల నువ్వే పక్కకు తప్పుకుని నాకు దారి ఇవ్వు," అన్నాడు ముని కుమారుడు. ఆ మాటలతో ఆగ్రహం చెందిన కల్మాషపాదుడు అతన్ని కొరడాతో కొట్టాడు.





రాజు అఘాయిత్యానికి అవాక్కయి పోయిన, ముని కుమారుడు కొంత సేపటికి తెప్పరిల్లుకుని, "రాక్షస స్వభావం గల నువ్వు రాజ్యమేలడానికి అర్హుడవు కావు; రాక్షసుడవై పోదువు గాక!" అని శపించాడు. మరుక్షణమే రాజు రాక్షసుడుగా మారిపోయాడు.



శక్తి వసిష్ఠమహాముని పెద్దకొడుకు. వసిష్ఠుడి పట్ల విశ్వామిత్రుడికి బద్ధ విరోధం వుండేది. అందువల్ల విశ్వామిత్రుడు, రాకసుడుగా ఉన్న కల్మాషపాదుణ్ణి మరొక దయ్యం ఆవహించేట్టు చేశాడు. దయ్యం ఆవహించిన రాకసరూపంలోని కల్మాషపాదుడు ఒకనాడు శక్తిని పట్టి గొంతునులిమి చంపేశాడు.

అంతటితో ఆగకుండా, కల్మాషపాదుడు వసిష్ఠముని ఆశ్రమానికి వెళ్ళాడు. అప్పుడు అక్కడ వసిష్ఠముని లేడు. రాకసుడు నిరాయుధులైన వసిష్ఠ
కుమారులందరినీ చంపి, ఆశ్రమాన్ని తగులబెట్టాడు.





...ిగి వచ్చిన
...ు కొడుకు
... ఆశ్రమాన్ని
...డు, చెప్ప
...ం. అయినా
... ఎవరి మీదా
...లేదు.



అటుపైన ఆశ్రమానికి ...
వసిష్ఠుడు, చచ్చిపడి వు...
లనూ, మంటలపాలైన ...
చూసి దిగ్భ్రాంతి చెంద...
లేనంత విషాదం చెందా...
అంతా తన విధి అనుకుని...
ప్రతీకారచర్య తీసుకో దల...

పుత్రశోకాన్ని భరించలేక వసిష్ఠుడు ప్రాణత్యాగం చేయాలనుకుని, ఒక కొండశిఖరం మీదికెక్కి, అప్పుడే ఆవిర్భవిస్తూన్న ఒక నదీ ప్రవాహంలోకి దూకాడు.





వసిష్ఠుడు నదిలో పడ్డాడు కాని, జల ప్రవాహంలో కొట్టుకుపోలేదు. పైగా అతని చుట్టూ జలం లేదు. మెత్తటి ఇసుక మీద అతడు నిలబడి ఉన్నాడు. కరుణామయి అయిన ఆ నదీమతల్లి అతన్ని రక్షించదలచిందని ఆయన గ్రహించాడు.

అయినా, వసిష్ఠుడు చనిపోవాలన్న కృత నిశ్చయంతో, నదీతీరం వెంట నడుస్తూ, నది మరింత లోతుగా ఉన్న చోటికి వెళ్ళి, కాళ్ళూ, చేతులూ బంధించుకుని, మళ్ళీ నదిలోకి దూకేశాడు.





నదిలోకి పడిన మరుక్షణమే అతని బంధాలన్నీ తెగిపోయాయి. నదీ ప్రవాహం అతని బంధాలను విడిపించడమే కాకుండా, చల్లని నీళ్ళతో సేద తీర్చి, అతనికి ఎంతో హాయిని కల్గించింది.

అప్పుడు వసిష్ఠుడికి, శక్తి భార్య అయిన అతని కోడలు, నదీ తీరంలో నిలబడి దీనంగా విలపించడం కనిపించింది. ఆమె నిండు గర్భిణి అనీ, త్వరలోనే ఆమె తనకొక మనవణ్ణి కని ఇవ్వబోతున్నదనీ వసిష్ఠుడికి జ్ఞాపకం వచ్చింది. కనీసం తన మనవడి కోసమయినా, తను జీవించాలన్న నిశ్చయంతో, అతడు నది నుంచి బయటకు వచ్చాడు.






కొత్త నదికి తనపట్ల ఉన్న దయా, తల్లి వంటి ప్రేమా చూసి వసిష్ఠుడు ఉప్పొంగిపోయాడు. భక్తులకు పాశ (బంధ) విముక్తి కల్గించే ఆ నదికి వసిష్ఠుడు విపాశ అని నామకరణం చేశాడు. విపాశా నదిలో స్నానం చేయడం, భక్తులు తమ భాగ్యంగా భావిస్తారు.



# రద్దులరాజు కథ

తండ్రి మరణానంతరం, యువకుడైన కుమారవర్మ సింహపురి రాజ్యానికి రాజయాడు. అతడు చురుకైనవాడు. ఏ విషయంలోనూ తాత్సారంగాని, ఆలస్యం గాని జరిగితే భరించలేకపోయేవాడు.

ఒకనాడు కుమారవర్మ రథంలో నగర వీధిగుండా వెళుతూండగా, ఒక తండ్రి కొడుకును గట్టిగా కోప్పడుతున్నాడు:

''ఒరే, పనికిమాలినవెధవా, నిన్ను గురుకులంలో విద్యాభ్యాసానికి పంపడం పొరబాటయింది. నీవు పుస్తకాలు చదవడం అయితే నేర్చావుగాని, కించిత్తు లోకజ్ఞానం కూడా అబ్బలేదు. పైగా సోమరితనం అలవడింది. అటు వ్యవసాయానికీ, యిటు ఉద్యోగానికీ కూడా పనికిరాకుండా పోయావు. గురుకులంలో నేర్పుతున్న విద్య ఎందుకూ పనికిరానిదని, నిన్ను చూస్తే తెలుస్తుంది!''

తండ్రి యింత గట్టిగా కోప్పడుతున్నా, కొడుకు అవన్నీ పట్టించుకోకుండా ఇంటి అరుగు మీద కూర్చుని ఏదో గ్రంథం చదువుకుంటున్నాడు.

కుమారవర్మ, తండ్రి ఆవేదనా, కొడుకు తీరూ గమనించాడు. అతడికి మరుక్షణం స్ఫురించినదేమంటే—గురుకులాలు ఇటువంటి సోమరిపోతుల్నీ, తెలివితక్కువ వాళ్ళనూ తయారు చేస్తున్నవని. కనక, గురుకులాలనే రద్దు చేస్తే, యిటువంటి పనికిమాలినవాళ్ళు మరికొందరు తయారయ్యే ప్రమాదం తప్పుతుంది!

కుమారవర్మ యిలా ఆలోచించి, ఆ మర్నాడే గురుకులాలను రద్దు చేస్తున్నట్టు, రాజ్యమంతటా చాటింపు వేయించాడు.

కొన్ని నెలల తర్వాత కుమారవర్మ సభ తీరివుండగా, ఒక మధ్య వయస్కుడు ఆవేశంతో ఊగిపోతూ అక్కడికి వచ్చాడు.

కలిదిండి జయ



కుమారవర్మ అడిగిన మీదట అతడిలా చెప్పాడు: "మహారాజా, వారం రోజుల క్రితం నా ఇంట్లో దొంగలుపడి సమస్తం దోచుకుపోయారు. ఈ విషయం కొత్వాలుకు విన్నవించుకున్నాను. ఆయన దొంగలను పట్టుకుని, నా వస్తువులు నాకు తిరిగి యిప్పిస్తానని మాట యిచ్చాడు. అయినా, యిప్పటివరకూ దొంగలు పట్టుబడలేదు. ప్రజలను దొంగల బారి నుంచి కాపాడలేని, ఈ రక్షకభటులు ఎందుకు? కొత్వాలు ఎందుకు? వీళ్ళకు నెలసరి వేతనాలుగా, తమరు వేలవరహాలు ఖర్చు పెడుతున్నారు. ఆ డబ్బంతా ప్రజలమైన మేము పన్నులరూపంలో చెల్లిస్తున్నదే!"

ఆ రాత్రి కుమారవర్మ రక్షక భటశాఖ గురించి దీర్ఘంగా ఆలోచించాడు. దొంగలను పట్టలేని రక్షకభటుల్ని పోషించడం, శుద్ధ తెలివితక్కువ అనిపించిందతడికి. ఆ శాఖనే రద్దు చేస్తే, ప్రజలకు పన్నుల భారం కొంత తగ్గుతుంది!

ఆ మర్నాడే రక్షకభటులందర్నీ పనుల నుంచి తొలగిస్తున్నట్టూ, ఆ శాఖే రద్దయి పోయినట్టూ ఉత్తరువులు జారీ చేశాడు, కుమారవర్మ.

ఈ విధంగా ఏ సమస్యకయినా పరిష్కారం, ఆ సమస్యకు మూలకారణమైన దాన్ని రద్దు చేయడమే అన్న నమ్మకం కుమారవర్మలో నాటుకుపోయింది. ఎప్పుడో—అసలు వస్తుందో రాదో కూడా తెలియని యుద్ధం కోసం, యిప్పటి నుంచే సైనికులకు శిక్షణ యివ్వడం, వాళ్ళకు జీతాలు చెల్లించడం వృథా అని, సైనికశాఖనే రద్దు చేశాడు, కుమారవర్మ. అలాగే, రాజాస్థానంలో కవులూ, కళాకారులూ కేవలం అలంకారప్రాయంగా వున్నారని, వాళ్ళకు బహుమానాలు ప్రకటించి గౌరవించే పద్ధతిని రద్దు చేశాడు.

ఈ రద్దుల ఫలితంగా కొద్ది కాలంలోనే రాజ్యంలో అరాచకపరిస్థితులు ఏర్పడినై. అయినా, కుమారవర్మ వాటిని గురించి

ఆలోచించే స్థితిలో లేడు. అయితే, ఈలోగా మంత్రి అనంతమిశ్రుడికి, సామంతరాజు శుక్రపాలుడు సింహపురి మీద యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నట్టు తెలియవచ్చింది.

ఇక ఆలసించడం ప్రమాదకరమని తెలుసుకున్న అనంతమిశ్రుడు, కుమార వర్మను కలుసుకుని, "మహారాజా, తమరు ఎదురైన సమస్యలన్నిటినీ, రద్దు అనే సూత్రం ద్వారా పరిష్కరించారు. ఇందువల్ల, ప్రజలెలాంటి సుఖశాంతులతో వున్నారో ఒకసారి చూసివద్దాం," అన్నాడు.



ఇద్దరూ సూర్యాస్తమయానికి ముందే, రాజధానికి సమీపంలో వున్న ఒక గ్రామానికి వెళ్ళారు. అక్కడ రావిచెట్టు కింది రచ్చబండ చుట్టూ గ్రామంలోని చిన్నా-పెద్దా అంతా చేరారు. రచ్చబండ మీద గ్రామ పెద్దతోపాటు మరి నలుగురు కూర్చుని వున్నారు.

గ్రామ పెద్ద ఆ నలుగుర్నీ, గ్రామస్థులకు పరిచయం చేస్తూ, "వీరు మన పొరుగు గ్రామాల నుంచి వచ్చిన గ్రామ ముఖ్యులు. మన రద్దులరాజు తిక్కబుద్ధి కారణంగా, రాజ్యంలో అందరూ మన లాగే నానా యాతనలూ అనుభవిస్తున్నారు. గురుకులం నుంచి వచ్చిన ఒక శిష్యుడు సోమరివాడైతే, మిగతా శిష్యులందరూ అలాగే తయారవుతారని ఊహించి, రాజు గురుకులాలనే రద్దు చేశాడు. ఇప్పుడు మన పిల్లలు గురుకుల విద్యాభ్యాసం లేనందున అజ్ఞానులూ, మూర్ఖులూ అయి, మన మెడల్లో గుదిబండల్లా తయారయారు," అన్నాడు.

అప్పుడు పక్కన వున్న గ్రామ ముఖ్యుల్లో ఒకడు అందుకుని, "రక్షక భటశాఖ రద్దు మాటేమిటి? రక్షకభటులు లేనందున, యిప్పుడు చిన్న చిన్న దొంగతనాలే కాక, బందిపోట్లు పెచ్చు పెరిగి గ్రామాలకు గ్రామాలనే దోచుకుంటున్నారు!" అన్నాడు.

అంతలో మరొక గ్రామ ముఖ్యుడు, "అయ్యలారా, అందరూ శ్రద్ధగా వినండి!

ఇప్పుడు దేశరక్షణ—అంటే మనందరి రక్షణ సమస్య ఎదురైంది. రాజు సైనిక శాఖనే రద్దు చేయడంతో, ఇంతవరకూ మన రాజుకు కప్పంకడుతూ అణిగిమణిగి వున్న సామంతుడొకడు, మన మీదికి యుద్ధానికి రాబోతున్నాడు,'' అన్నాడు.

''కవులు, కళాకారుల విషయంలో, యీ రద్దులరాజు చేసిందేమిటి?'' అన్నాడు మరొక గ్రామ ముఖ్యుడు ఆవేశంగా. ''వాళ్ళంతా పక్క రాజ్యాలకు వలసవెళ్ళారు. ఇది మన కెంత అవమానకరమైన విషయం! అశాశ్వతమైన రాజవంశాన్నీ, మననూ, మన రాజ్యాన్నీ చరిత్రలో శాశ్వతంగా నిలిపేది కవుల రచనలూ, కళాకారుల కళలే కదా!''

గ్రామపెద్ద వాళ్ళతో, ''నేను చెప్పబోయేది కష్టనష్టాలకు ఓర్చి సాధించవలసిన కార్యం. అందరం కలిసి, రాజు కుమారవర్మకు వంశపారంపర్యంగా వచ్చిన రాజపదవిని రద్దు చేద్దాం. మన కష్టసుఖాలను అర్థం చేసుకుని పాలించగల వాణ్ణి రాజుగా ఎన్నుకుందాం!'' అన్నాడు.

అప్పుడు ప్రజల నుంచి పెద్దగా కరతాళధ్వనులు వినిపించినై. ఇది చూసిన కుమారవర్మకు తల తిరిగిపోయినట్టయింది. అతడు అప్పటికప్పుడే మంత్రితో పాటు బయలుదేరి రాజధాని చేరాడు.

తరవాత మంత్రి అనంతమిశ్రుడితో సంప్రతించి, ఆయన సలహామేరకు రద్దు చేసిన వాటన్నిటికీ తిరిగి ఉచితస్థానం కల్పించాడు. ప్రజల సాయంతో కొద్ది రోజుల్లోనే పెద్ద సేనను సమకూర్చి, సామంతుడైన శుక్రపాలుణ్ణి రాజ్యం నుంచి తరిమివేశాడు. వలసపోయిన కవులనూ, కళాకారులనూ సాదరంగా ఆహ్వానించి, వారిచేత ప్రతి సాయంకాలం రాజోద్యానంలో కవితాగానం, కళాప్రదర్శనలు ఏర్పాటు చేశాడు.

దీనితో ప్రజలకు కుమారవర్మ రాజపదవిని రద్దుచేయాలన్న అభిప్రాయం పోయి, అతడంటే భక్తిగౌరవాలు కలిగాయి.





# తీరని కోరిక

శ్రీహరికి చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోవడంతో, వాణ్ణి తాత పెంచి పెద్ద చేశాడు. తాతకు వుండేందుకు చిన్న ఇల్లు తప్ప, మరే ఆస్తిపాస్తులూ లేవు. అతను కూలీ నాలీ చేసి మనవణ్ణి పోషిస్తూ వచ్చాడు. శ్రీహరిని తాత ఏనాడూ తన వెంట కూలి పనులకు తీసుకుపోలేదు. ఏ వృత్తి పని అయినా నేర్పించే ప్రయత్నం చెయ్యలేదు. ఆ కారణం వల్ల, తాత హఠాత్తుగా మరణించడంతో, పాతిక ఏళ్ళవాడయిన శ్రీహరి పసిపిల్లవాడిలా బెంబేలుపడిపోయాడు.

తాత దాచిపెట్టిన డబ్బుతో శ్రీహరి మూడు మాసాలు గడిపాడు. తరవాత ఏదైనా పని కావాలంటూ గ్రామంలో వాళ్ళను అడిగాడు. వాళ్ళు అందుకు నవ్వి, "తాత పోయేదాకా, అతను సంపాయించిన డబ్బుతో, తిని కూర్చున్నావు. నీకు ఏం పని చాతనవునో మాకు తెలుసు, వెళ్ళు!" అనేశారు.

శ్రీహరికి ఆ ఊరంటే కంపరం ఎత్తి, మిగిలివున్న ఇంటిని అమ్మేసి, ఆ డబ్బుతో మరొక ఊరు చేరాడు. అక్కడ వాడొక ఇంటివాటా అద్దెకు తీసుకుని, తిరిగి ఉద్యోగప్రయత్నాలు ప్రారంభించాడు.

అయితే, అక్కడా వాడికి పొద్దెదురైంది. చూస్తూ, చూస్తూ ముక్కూ మొహం తెలియనివాడికి ఉద్యోగం యివ్వడం ఎలా? అన్నారు కొందరు.

ఈ విధంగా శ్రీహరికి ఏ పనీ దొరకక్కముందే, ఉన్న కొద్దిపాటి డబ్బూ అయిపోవచ్చింది. ఆ బెంగతో వాడికి రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టేదికాదు. అలాంటి ఒక రాత్రి వాడు తలుపు తెరిచి ఇంటి పెరట్లోకి వచ్చాడు. పున్నమిరోజులు కావడంతో, పెరడంతా వెన్నెల పరుచుకుని వున్నది.

మాచిరాజు కామేశ్వరరావు



ఆ వెన్నెల వెలుగులో ఇంటి యజమాని కూతురు ప్రమీల పెరటి బావిలోకి దూక బోతూ వుండడం వాడికి కనిపించింది.

శ్రీహరి చప్పునపోయి, ఆమె చెయ్యి పట్టుకుని, ''ఇదేం పని ? నీకేమన్నా మతి స్థిమితం తప్పిందా ?'' అన్నాడు కోపంగా.

ప్రమీల వెక్కి వెక్కి ఏడుస్తూ, తన కష్టాల గురించి వాడికి చెప్పింది: ఆమెకు తల్లి లేదు. సవతితల్లికి, పెళ్ళీడు కొచ్చిన యిద్దరు కూతుళ్ళున్నారు. తన పెళ్ళి బాగా డబ్బున్న ఒక ముసలివాడితో జరిపించి, అతడి సాయంతో తన కూతుళ్ళ పెళ్ళిళ్ళు ఘనంగా జరిపించాలని చూస్తున్నది.

''ఈ పెళ్ళి చేసుకునేకంటే, చావడం మేలని యిక్కడి కొచ్చాను,'' అన్నది ప్రమీల కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

''కష్టాల నుంచి బయటపడడానికి చాలా ఓర్పు అవసరం. ఎందునా తొందర పాటు కూడదు,'' అన్నాడు శ్రీహరి.

ప్రమీల వాడి ముఖం కేసి పరీక్షగా చూసి, ''ఒకవైపున కష్టాలు ముంచు కొస్తూంటే, ఈ నీతివాక్యాలు నా దగ్గిర వల్లించి ప్రయోజనం లేదు. నేనెంత ఓర్పు వహించినా, మరొక రెండు వారాల్లో, ఆ ముసలివాడితో నా పెళ్ళి జరిగిపోతుంది," అని ఒక క్షణం ఆగి, ''నువ్వు, నన్ను పెళ్ళాడి, కష్టాల నుంచి ఎందుకు గట్టెక్కించకూడదు !'' అన్నది.

అప్పటికి ఆమె ఆత్మహత్యా ప్రయత్నం మాన్పించేందుకు శ్రీహరి అలాగే అని, ఆమెను ఇంట్లోకి పంపించివేశాడు. మర్నాడు, ఆమె తల్లిదండ్రుల దగ్గిర శ్రీహరి, పెళ్ళి ప్రస్తావన తెచ్చాడు.

''నీకు ఉద్యోగం లేదు. సొంత ఆస్తిపాస్తులంటూ అసలేలేవు. అటువంటి నువ్వు, ఈ పెళ్ళి సంగతి తేవడం బుద్ధి గల పనేనా? ముందు పోయి, ఈ నెల అద్దెపట్టుకురా. లేదంటే, వెంటనే వాటా ఖాళీచేసిపో,'' అన్నది ప్రమీల సవతితల్లి కోపంగా.



శ్రీహరి తల వంచుకుని అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. ఆ రోజంతా వాడు చేసిన ఉద్యోగ ప్రయత్నాలేమీ ఫలించలేదు. దానితో ఇంటికి పోవడం యిష్టం లేక, శ్రీహరి చీకటిపడేవేళ ఊరికి దూరంగా వున్న చిట్టడవికిపోయి, ఒక చెట్టుకింద పడుకున్నాడు. కొంతసేపటికి వాడికి చిన్న కునుకుపట్టింది.

అర్ధరాత్రివేళ దాపుల్లో పెద్ద ధ్వని కావడంతో శ్రీహరి కళ్ళు తెరిచాడు. ఎదురుగా ఒక ముసలి పిశాచం!

''ఇంత రాత్రివేళ, నాబోటి అతి భయంకర పిశాచాలు సంచరించే యీ ప్రదేశానికి వచ్చిన నీ ధైర్యాన్ని మెచ్చాను. సరే, ముందు అక్కణ్ణించిలే. అది నా స్థలం. ఇక్కడ తప్ప, మరెక్కడా నాకు నిద్రపోబుద్ధికాదు,'' అన్నది ముసలి పిశాచం.

అన్నివిధాలా విసిగిపోయి నిరాశలో వున్న శ్రీహరి, పిశాచాన్ని చూసి, ''నీకన్న భయంకరులైన మనుషుల మధ్య బతకలేక, యిక్కడికి వచ్చాను. నీ స్థలంలో పడుకో. నేను మరొక చెట్టుకిందికి పోతాను,'' అంటూ లేచి నిలబడ్డాడు.

ముసలి పిశాచం వాణ్ణి ఆగమని, "మనుషుల్ని గురించి హీనంగా మాట్లాడేస్తున్నావు. ఇంతకూ, నీకొచ్చిన కష్టం ఏమిటి?'' అని అడిగింది.

శ్రీహరి తన సంగతంతా పిశాచానికి చెప్పి, ''ఎంత కాళ్ళావేళ్ళాపడినా, ఎవరూ ఉద్యోగం యివ్వలేదు. నిజాయితీపరుణ్ణి ఎవరూ నమ్మరు,'' అన్నాడు.

ఆ మాటలకు పిశాచం బిగ్గరగా నవ్వి, ''నా కాలంలోనూ లోకంతీరు అంతేరా, అబ్బీ! దిగులుపడకు, నీ కష్టాలు నేను తీరుస్తాను,'' అంటూ వెళ్ళి, చెట్టు తొర్రలోంచి, ఒక చిలుముపట్టిన రాగి ఉంగరం తెచ్చి, ''ఇది నీ వేలుకు పెట్టుకుని, ఎవర్ని ఏం అడిగినా, మారుమాట లేకుండా యిచ్చేస్తారు. అయితే, ఒక సంగతి గుర్తుంచుకో. దీనిమహిమ మూడుసార్లకు మించి పని చెయ్యదు,'' అని రాగి ఉంగ



రాన్ని శ్రీహరికి యిచ్చి, తెల్లవారవస్తుండడంతో మాయమైపోయింది.

శ్రీహరి ఉంగరాన్ని వేలికి పెట్టుకుని, ఊళ్ళో అందరికన్న పెద్ద వ్యాపారి దగ్గిరకు పోయి, "నాకు, మీ దగ్గిర ఉద్యోగం కావాలి!" అన్నాడు.

అంతకు ముందు శ్రీహరిని, నా దగ్గిర ఏ ఉద్యోగం లేదు పొమ్మన్న వ్యాపారి, ఉంగరం మహిమవల్ల, "ఈ రోజే వచ్చి పనిలో చేరు!" అన్నాడు,

శ్రీహరి, ఆ సాయంత్రం ప్రమీల సవతితల్లితో, "నాకు ఉద్యోగం వచ్చింది. ప్రమీల నిచ్చి పెళ్ళి చెయ్యండి," అన్నాడు.

"అదెంత భాగ్యం, నాయనా! ఈ వారంలోనే మీ పెళ్ళి జరిపిస్తాను," అన్నది ప్రమీల సవతితల్లి.

వారం తిరక్కుండానే వాళ్ళ పెళ్ళి జరిగిపోయింది.

ఆ తరవాత పది రోజులకు ప్రమీల, శ్రీహరిని, "ఒకే రోజులో, మా సవతితల్లి మనస్సు ఎలా మార్చగలిగావు? రాదనుకున్నచోట ఉద్యోగం ఎలా సంపాయించావు?" అని అడిగింది.

శ్రీహరి జరిగిందంతా ఆమెకు చెప్పి, "ఇందుకు పిశాచం యిచ్చిన రాగి ఉంగరం సాయపడింది," అన్నాడు.

రాగి ఉంగరం మాట వింటూనే ప్రమీల కెవ్వుమని అరిచి, కింద పడబోయింది. శ్రీహరి ఆమెను పట్టుకుని, "ఏం జరిగింది?" అని అడిగాడు.

"పొద్దున పెట్టెలో బట్టలు సర్దుతూ, బాగా చిలుముపట్టిన రాగి ఉంగరం ఒకటి కనిపిస్తే, అశుభం అని పెరట్లోని చెత్త కుప్ప మీదికి గిరవాటు వేశాను," అన్నది ప్రమీల.

"అంతే గదా!" అన్నాడు శ్రీహరి తాపీగా.

ఆ మాటకు ప్రమీల కోపం తెచ్చుకుని, "అంత మహిమగల ఉంగరాన్ని దగ్గిర పెట్టుకుని, నువ్వు రెండు మతిమాలిన

కోరికలు కోరావు. నా సవతితల్లిని పెళ్లికి, యీ ఇల్లు కట్నంగా యివ్వమని అడగవలసింది. ఆ వ్యాపారిని ఉద్యోగం కాక, వ్యాపారంలో వాటా యివ్వమని అడగవలసింది. ముందు ఆ ఉంగరం వెతకాలి,'' అంటూ బయలుదేరబోయింది.

శ్రీహరి ఆమెను ఆపి, ''ముందే చెప్పానుగా! ఎవరు ఎన్నివరాలు యిచ్చినా, మనకు ప్రాప్తం వున్నవే మనకు దక్కుతాయి. మనకు యింతకుమించి ప్రాప్తంలేదు కాబట్టే, నువ్వా ఉంగరాన్ని పారేశావు,'' అన్నాడు.

''దానికి మరొక కోరిక తీర్చే మహిమ వున్నది. వెతికి తెస్తాను. ఈసారి నువ్వు దాన్ని వేలికి పెట్టుకుని, మన జమీందారును సగం జమీ యివ్వమని అడుగుదువుగాని,'' అని ప్రమీల దీపం వెలిగించుకుపోయి, చెత్తకుప్పలో వెతికి ఉంగరాన్ని బయిటికి తీసింది.

తరవాత ఆమె ఉంగరాన్ని తన వేలికి పెట్టుకుని ''జమీందారును అర్ధ జమీ యివ్వమని కోరడం, నీ కిష్టం లేనట్టున్నది. ఆయన దగ్గిరకు నేనే వెళతాను, సరేనా?'' అని అడిగింది.

''అలాగే అడుగు!'' అంటూ శ్రీహరి పెద్దగా నవ్వి, ''దాన్ని తిరిగి చెత్తకుప్ప మీదికి విసిరెయ్యి. ఉంగరం పెట్టుకుని నన్నొక కోరిక కోరావు, సరేనన్నాను. దానితో ఉంగరం మహిమ పోయింది. తెలిసిందా?'' అన్నాడు.

ఉంగరం మహిమ పోయిందని గ్రహించి, ప్రమీల కళ్ళనీళ్ళు పెట్టుకున్నది. శ్రీహరి ఆమెను ఓదార్చుతూ, ''తృప్తిలేకపోవడమే దుఃఖానికి కారణం. ఇరవై రోజుల క్రితం, నాతో పెళ్ళి అయితే చాలు, మరే కష్టం లేదనుకున్నదానివి, యిప్పుడు ఏదో తీరని కష్టాల్లో వున్నట్టు కంట తడిపెడుతున్నావు!'' అన్నాడు.

భర్త మాటల్లోని సత్యం గ్రహించిన ప్రమీల, ''నా అజ్ఞానం, దురాశా చూస్తూంటే, నాకే సిగ్గవుతున్నది,'' అంటూ కళ్ళనీళ్ళు తుడుచుకున్నది.





# ఇద్దరు మోసగాళ్ళు

సింథానగరంలో దావూద్ అనే ఒక వర్తకుడు ఉండేవాడు. ఒంటె మీద సరకులు ఎక్కించుకుని ఊరూరా తిరిగి వ్యాపారం చేసేవాడాయన. అతడు చాలా నిజాయితీపరుడు. అందువల్ల అతనికి ప్రజల మధ్య మంచి పేరూ, నగరంలో చాలామంది స్నేహితులూ ఉండేవారు.

అదే నగరంలో ఇద్దరు మోసగాళ్ళు ఉండేవారు. వాళ్ళిద్దరూ అమాయకులను మంచి మాటలతో మోసం చేసేవాళ్ళు. దావూద్ మంచితనం గురించి వాళ్ళకు తెలియవచ్చింది. ఎలాగైనా అతన్ని మోసం చేయాలని వాళ్ళు పథకం వేశారు.

ఒక రోజు దావూద్ ఒంటె మీద విలువైన సరకులు వేయించుకుని వ్యాపారం కోసం పొరుగు పట్టణానికి బయలుదేరాడు. దానిని చూసిన మోసగాళ్ళిద్దరూ, ఇదే మంచి సమయం అనుకుని, నాసిరకం బట్టలమూటలను ఒంటెల మీద వేసుకుని అతన్ని వెంబడించారు.

మధ్యాహ్నం వేళకు దావూద్ విశ్రాంతి తీసుకోడానికి ఒక చెట్టు నీడలో కూర్చున్నాడు. అప్పుడే అక్కడికి ఆ ఇద్దరు మోసగాళ్ళూ వచ్చి, దావూద్‌కు నమస్కరించి, కుశలప్రశ్నలు వేశారు. కొంతసేపయిన తరవాత, "మీవంటి అనుభవజ్ఞుడయిన వర్తకుణ్ణి అయాచితంగా కలుసుకోవడం నిజంగా మా అదృష్టం. ఈ ప్రయాణంలో మీరే మాకు దారి చూపి సహాయం చెయ్యాలి," అన్నారు.

దావూద్ సరే అన్నట్టు చిన్నగా నవ్వాడు. ఎండ చల్లబడిన తరవాత, ముగ్గురూ అక్కడి నుంచి బయలుదేరి, సాయంకాలనికి ఆ పట్టణం పొలిమేరల్లోకి చేరి, ఆ రాత్రికి రహదారి పక్కన ఉన్న ఒక సత్రంలో బస చేద్దామనుకున్నారు.

అరేబియా కథ

దావూద్ తన ఒంటెను సత్రానికి దాపుల నున్న ఒక స్తంభానికి కట్టివేశాడు. స్నేహితులిద్దరూ తమ బట్టల మూటలను, సత్రం గదిలో పెట్టి తాళం వేసుకుని, ''రండి, ముగ్గురం వెళ్ళి అంగడి వీధిలో ఉన్న భోజనశాలలో భోజనం చేసి వద్దాం,'' అన్నారు దావూద్‌తో ఎంతో ఉత్సాహంగా.

వాళ్ళు బస చేసిన చోటి నుంచి భోజన శాలకు దగ్గరి దారి ఒకటి ఉన్నది. అది ఎప్పుడూ నిర్మానుష్యంగా ఉంటుంది. భోజనానికి వెళ్ళి వచ్చే సమయంలో దావూద్‌ను గొంతు నులిమి చంపి, అతని విలువైన సరుకులను దొంగిలించుకుని పారిపోవాలన్నది వాళ్ళ పథకం!



అయినా దావూద్, ''నాకు ఇప్పుడు ఆకలి వేయడం లేదు. నా దగ్గర ఒక రొట్టె కూడా ఉన్నది. మరి కొంతసేపు తరవాత దాన్ని తిని పడుకుంటాను. మీరు వెళ్ళి భోజనం చేసిరండి,'' అన్నాడు.

ఆ మాటలకు మిత్రులిద్దరూ నిరుత్సాహ పడిపోలేదు. మరొక అవకాశం రాకుండా పోతుందా అనుకుని భోజనానికి బయలు దేరారు. అప్పుడు సత్రం యజమాని, అక్కడి నుంచి తూర్పు దిక్కులో ఒక భోజనశాలా, పడమటిదిశలో మరొక భోజన శాలా ఉన్నాయనీ, రెండూ మంచివేననీ వాళ్ళకు తెలియజేశాడు.

''అలా అయితే నేను తూర్పున ఉండే భోజనశాలకు వెళ్ళి మంచి ఆహారం కొనుక్కుని వస్తాను. నువు పడమటి శాలకు వెళ్ళి అక్కడ ఏమైనా కొను క్కుని రా, ఇక్కడే కలిసి భోంచేద్దాం,'' అన్నాడు మొదటివాడు రెండవవాడితో.

''చాలామంచి ఆలోచన,'' అన్నాడు రెండవవాడు.

ఇద్దరూ చెరొక దిక్కుకు వెళ్ళి ఒక గంటసేపు తరవాత తిరిగి వచ్చారు.

''నువేమి తెచ్చావు?'' అని అడిగాడు మొదటివాడు.

''రొట్టే, పాలూ తెచ్చాను,'' అన్నాడు రెండవవాడు.

"అరెరే, నేనూ అవే తెచ్చాను," అన్నాడు మొదటివాడు ఆశ్చర్యంగా.

"అయితే ఒకటి చేద్దాం. నువు తెచ్చిన రొట్టే, పాలూ నేను తింటాను. నేను తెచ్చినవి నువు తిను," అన్నాడు రెండవవాడు.

"అద్భుతమైన ఆలోచన. నేనూ అదే చెబుదామనుకున్నాను," అన్నాడు మొదటివాడు నవ్వుతూ.

ఇద్దరూ గది లోపలికి వెళ్ళి, ఒకరు తెచ్చినవి, మరొకరు తీసుకుని తిన్నారు.

కొంతసేపటికి ఇద్దరూ వాంతులు చేసుకుంటూ బాధతో గట్టిగా మూలగసాగారు. సందడి విని, అందరూ అక్కడికి పరుగెత్తుకు వచ్చారు. ఒకణ్ణి ఒకరు చేయెత్తి చూపుతూ, ఇద్దరూ అలాగే కిందపడి విలవిలతన్నుకుంటూ ప్రాణాలువదిలారు.

వాళ్ళనుకున్నట్టు నిజంగానే మిత్రుల మనసులు రెండూ ఒకే విధంగా ఆలోచించాయి. ఆహారం కొనుక్కురావడానికి వెళ్ళినపుడు దారిలో—దావూద్ సరకులను అపహరించిన తరవాత అందులో రెండవవాడికి భాగం ఇవ్వవలసి వస్తుంది కాబట్టి అవతలివాణ్ణి చంపినట్టయితే, ఆ నష్టం తప్పుతుందని ఆలోచించి, ఇద్దరూ పాలలో విషం కలిపారు. దాని ఫలితంగా ఇప్పుడు ఇద్దరూ ప్రాణాలు కోల్పోయారు.

తనతో ప్రయాణం చేసిన ఇద్దరు మిత్రులూ చనిపోవడం చూసి దావూద్ ఎంతో బాధపడ్డాడు. మరి కొంతసేపటికి అక్కడికి వచ్చిన వ్యాపారులతో ఆ మిత్రుల హఠాత్ మరణం గురించి చెప్పి, "పాపం, ఆ మిత్రులిద్దరూ మన ఊరి వర్తకులే," అన్నాడు విచారంగా.

ఆ వ్యాపారులు వెళ్ళి ఆ మృత దేహాలను చూసి, "వర్తకులా వీళ్ళు? నీకు తెలియదు గాని, వీళ్ళిద్దరూ మన నగరంలో పేరుమోసిన మోసగాళ్ళు! హంతకులు!" అంటూ వాళ్ళను గురించి వివరంగా చెప్పారు.

అంతా విన్న తరవాత, దావూద్ ఆ మోసగాళ్ళ పథకం ఏమై ఉంటుందో కొంతవరకు ఊహించుకోగలిగాడు.






తారకుడు కోపావేశంతో ఇంటికిపోయి, శివపంచాక్షరీ మంత్రం జపించి, ధ్యానంలో ఉండగా, అశరీర వాక్కు, "తారకా, విచారించకు. నీకు మోక్షం ఇస్తాను," అన్నది. తారకుడు పూజ ముగించి, లింగాన్ని కంఠంలో ధరించి, మర్నాడు తిరిగి యుద్ధానికి వచ్చాడు.

కుమారస్వామి తారకుడితో యుద్ధం చేశాడు. అతను ఎన్ని అస్త్రాలు ప్రయోగించినా తారకుడు చెక్కు చెదరలేదు. తారకుడి మెడలో ఈశ్వరలింగం ఉండగా అతన్ని ఏ అస్త్రమూ ఏమీ చెయ్యలేదని నారదుడు కుమారస్వామికి చెప్పాడు.

ఈ మాటలు గుర్తుంచుకుని కుమారస్వామి తారకుడి మెడలోని లింగాన్ని ఆగ్నేయాస్త్రంతో కొట్టాడు. ఆ లింగం అయిదు ముక్కలై కిందపడింది. సూర్యుడూ, విశ్వకర్మా మొదలైనవారు వెంటనే ఆ ముక్కలను ఏరి తీసుకుపోయి, అయిదుచోట్ల ప్రతిష్ఠించారు. అవే పంచభీమలింగేశ్వరాలు.

తారకుడి మెడలో లింగం ఎప్పుడయితే ముక్కలయిందో, కుమారస్వామి బ్రహ్మాస్త్రం ప్రయోగించి తారకుణ్ణి సంహరించాడు. దేవీగణాలు తారకుడి సేనలను చంపుతూ, రక్తమాంసాలు తింటూ, నృత్యాలు చేశాయి. దేవతలు పుష్పవర్షం కురిపించారు.

తారకుణ్ణీ, అతనితోబాటు అనేకమంది ఇతర రాక్షసులనూ చంపిన అనంతరం



విషయం చెప్పటానికి వచ్చాను. ఈ సమీపంలోనే భిల్లుపురం అనే గ్రామం ఉన్నది. అక్కడ పుళిందు డనే భిల్లురాజు ఉన్నాడు. అతను ఈశ్వరభక్తుడు. అతనికీ, అతని భార్యకూ చాలాకాలం సంతానం కలగలేదు. ఇలా ఉండగా ఆ భిల్లు రాజుకు వనంలో ఒక ఆడపిల్ల దొరికింది. అతను ఆ పిల్లను తెచ్చి తన భార్య కిచ్చాడు. ఆ దంపతులు ఆ పిల్లకు వల్లి అని పేరు పెట్టి అతి గారాబంగా పెంచారు. వల్లి అందచందాలు వర్ణించటం నా తరం కాదు. బంగారు బొమ్మ! చూడగానే వనలక్ష్మి అనిపిస్తుంది! ఆమె నీకు భార్య అవుతుందని బ్రహ్మదేవుడు మాటల సందర్భంలో నాతో అన్నాడు. అందుచేత నువు ఆమెను పెళ్లి చేసుకుని సుఖపడు,'' అన్నాడు నారదుడు.

తరవాత నారదుడు కుమారస్వామి వద్ద సెలవు తీసుకుని భిల్లురాజైన పుళిందుడి వద్దకు వెళ్ళాడు. పుళిందుడు ఆయనను గౌరవించి కూర్చోబెట్టి, ''మునీశ్వరా, మా వల్లికి తగిన గుణరూపాలు గల భర్త ఎక్కడ దొరుకుతాడో సెలవివ్వండి?'' అని అడిగాడు.

''ఈ పిల్లకు తగిన వరుడు శివుడి కొడుకైన కుమారస్వామి మాత్రమే. అతనికి కూడా వల్లి కన్న తగిన భార్య

కుమారస్వామి కొంతకాలం స్వర్గంలోనే ఉండి, పార్వతీ పరమేశ్వరులను సేవించాలని బుద్ధిపుట్టి కైలాసానికి వచ్చి, అక్కడ ఉండిపోయాడు.

ఆ కాలంలో అతను తన స్నేహితులతో కలిసి ఒకనాడు వనవిహారం చేస్తూ ఉండగా అతనివద్దకు నారదమహాముని వచ్చాడు. కుమారస్వామి నారదుడికి అతిథి సత్కారాలు చేసి, ''మునీశ్వరా, లోకాలలో విశేషాలేమిటి?'' అని అడిగాడు.

''నీ దయవల్ల అన్ని లోకాలవారూ సుఖంగా ఉన్నారు. రాక్షసులను చంపేశావు గనక యజ్ఞయాగాదులు చక్కగా జరుగుతున్నాయి. అయితే నీకు ఒక




దొరకదు. త్వరలోనే కుమారస్వామి వన విహారానికి వచ్చి, వల్లిని చూసి మోహిస్తాడు. అతను మీకు అల్లుడవుతాడు. మీరు ధన్యులు. శివుడు వియ్యంకుడు కావటం కన్న మహాభాగ్యం ఏమున్నది?'' అని పుళిందుడితో అని నారదుడు వెళ్ళిపోయాడు.

నారదుడు వల్లి సౌందర్యం గురించి చెప్పిపోయినది మొదలు కుమారస్వామి మనసులో ఆరాటం బయలుదేరింది. ఆమెను పెళ్ళాడాలన్న కోరిక అతనిలో తల ఎత్తింది. భిల్లు కన్యను పెళ్ళాడతానంటే తల్లిదండ్రులు ఒప్పుకుంటారో లేదో అనుకున్నాడు అతను. ఏ నిర్ణయం చెయ్యటానికైనా ముందు తాను ఆమెను కళ్ళారా చూడటం అవసరం అని అతనికి తోచింది. అందుకని అతను తన పరివారాన్ని వెంటబెట్టుకుని, భిల్లుపురం సమీపంలో వన విహారం చెయ్యసాగాడు.

నారదుడి మాటలు కుమారస్వామిని కలత పెట్టినట్టే వల్లిని కూడా కలత పెట్టాయి. కుమారస్వామి ఎప్పుడు వస్తాడా అని ఆమె ఆత్రంగా ఎదురు చూస్తూన్నది. అతను తన వంటి నీచకన్యను పెళ్ళాడతాడా అని సందేహిస్తున్నది. తన తల్లిదండ్రులు తనను పెంచుకున్న వారేగాని కన్నవారు కారుగదా అని తన మనస్సును సమాధానపరుచుకుంటున్నది. కుమారస్వామి తనను పెళ్ళాడకపోతే దేహత్యాగం చెయ్యటానికైనా ఆమె సిద్ధంగా ఉన్నది.

ఇలా అనుకున్నాక వల్లి తన తల్లిదండ్రులకు చెప్పకుండా, కొందరు చెలికత్తెలను వెంటబెట్టుకుని వనవిహారానికి బయలుదేరి వెళ్ళింది. ఆమె తన చెలికత్తెలతో సహా ఒక గున్నమామిడి చెట్టు కింద కూర్చుని ఉండగా, కుమారస్వామి తన అనుచరులతో వచ్చి, సమీపంలోనే మరొక చెట్టు కింద కూర్చున్నాడు.

వల్లి చెలికత్తె ఒకతె అతని వద్దకు వచ్చి, ''అయ్యా, మీ రెవరు? ఎక్కడినుంచి వచ్చారు? ఈ పుష్పవనం పుళింద



రాజు కుమార్తె అయిన వల్లీదేవి విహార స్థలం. ఈ ప్రదేశానికి మగవాళ్ళు రాకూడదు,'' అన్నది.

ఈ మాటలు వినగానే కుమారస్వామికి కొత్త ఉత్సాహం వచ్చింది. అతను వల్లి చెలికత్తెతో, ''నా పేరు కుమారస్వామి. నేను శివపార్వతుల కుమారుణ్ణి. మాది కైలాసం. మీ వల్లి సమాచారం వినదగినదైతే చెప్పు,'' అన్నాడు.

''ఈ పుళిందదేశానికి రాజైన పుళిందుడు భిల్లులకు రాజు. భిల్లుపురం ఆయన రాజధాని. ఆయన ఈశ్వరభక్తుడు. ఆయనకు పిల్లలు లేరు. ఈ వనంలోనే ఆయనకు వల్లి దొరికింది. ఆయనా, ఆయన భార్యా ఆ పిల్లను పెంచుకుని పెద్దదాన్ని చేశారు,'' అని చెలికత్తె చెప్పింది.

''మీ వల్లికి వివాహం అయిందా?'' అని కుమారస్వామి అడిగాడు.

''సంబంధం కుదిరింది. పెళ్ళి కావడమే తరవాయి,'' అన్నది చెలికత్తె.

కుమారస్వామి ఆత్రంగా, ''ఏమిటా సంబంధం? వరుడు ఎవరు?'' అని అడిగాడు.

''నిన్న మా రాజుగారి దగ్గిరికి నారద మహాముని వచ్చాడు. శివుడి కుమారుడైన కుమారస్వామి వచ్చి వల్లిని పెళ్ళాడతాడని ఆయన మా రాజుగారితో చెప్పి వెళ్ళాడు. అది మొదలు మా వల్లి కుమారస్వామి కోసం కలవరిస్తున్నది. ఆవిడగారికి క్షణమొక యుగంగా ఉన్నది. ఆమె బాధ చూడలేక వనవిహారానికి తీసుకు వచ్చి ఆ మామిడిచెట్టు కింద కూర్చోబెట్టాం. నువు ఇక్కడే ఉండు. వల్లిని తీసుకు వస్తాను,'' అంటూ చెలికత్తె వెళ్ళి, వల్లిని చెయ్యిపట్టుకుని లాక్కొచ్చింది.

కుమారస్వామి వల్లి చెయ్యి పట్టుకుని, ''నా వెంట వచ్చెయ్యి, మనం పెళ్ళి చేసుకుందాం,'' అన్నాడు.

''నన్ను పెళ్ళి చేసుకోదలిస్తే నా తల్లిదండ్రుల అనుమతి పొందాలి. లోకనింద

తెచ్చుకునే పనులు చేయరాదు. కాస్సేపు ఇక్కడే ఉండు. మన పెళ్ళికి మా వాళ్ళ అనుమతి పొందివస్తాను.'' అంటూ వల్లి చెయ్యి విడిపించుకుని, తన చెలికత్తెలతో సహా ఇంటికి వచ్చేసింది.

జరిగిన సంగతి తెలిసి పుళిందుడు సపరివారంగా కుమారస్వామి వద్దకు వచ్చి, ఆ రాత్రి తెల్లవారుఝామున లగ్నం ఉన్నదని చెప్పి, అతన్నీ, అతని పరివారాన్నీ వెంటబెట్టుకుపోయి, విడుదులలో ఉంచి, పెళ్ళి ప్రయత్నాలు చెయ్యటానికి ఇంటికి వెళ్ళాడు.

ఈ వార్త తెలిసి పార్వతీ శివులు కైలాసం నుంచి వచ్చి, కుమారస్వామి వివాహం జరిపించి, వధూవరులతో సహా కైలాసానికి తిరిగి వెళ్ళారు.

కొంతకాలం గడిచింది. శోణితపురంలో గజాసురుడు అనే వాడొకడు అవతరించాడు. వాడు కూడా బ్రహ్మను గురించి ఘోరమైన తపస్సు చేసి, అనేక వరాలు పొంది, మూడు లోకాలనూ స్వాధీనం చేసుకుని ఏలసాగాడు. పరమ శివభక్తుడైన గజాసురుడి పాలనలో ప్రజలందరూ సర్వసుఖాలూ అనుభవించారు. వారికి ఎలాటి ఈతిబాధలూ లేవు.

ఒకనాడు నారదుడు గజాసురుడి వద్దకు వెళ్ళి, అతడి చేత అతిథి మర్యాదలు పొంది, ''గజా, నువు గొప్ప ఈశ్వర భక్తుడవు. శివుణ్ణి నీ హృదయంలోనే ఉండమని కోరరాదా ?'' అన్నాడు.

గజాసురుడికి ఈ ఆలోచన నచ్చింది. అతను తన పూజతో శివుణ్ణి ప్రత్యక్షం చేసుకుని, తన హృదయంలోనే ఉండమని వరం కోరాడు. శివుడు అందుకు సమ్మతించి, లింగరూపంలో గజాసురుడి హృదయంలో ఉండిపోయి, గజాసురుడి మానసిక పూజలు అందుకోసాగాడు.

శివుడు ఏమైపోయినదీ పార్వతికి తెలియరాక, రుద్రగణాల చేత లోకాలన్నీ వెతికించి, శివుడు లింగరూపంలో గజాసురుడి హృదయంలో ఉన్నట్టు తెలుసుకున్నది.



# వృత్తిధర్మం

కృష్ణాపురంలో వుండే భద్రయ్య అనే ఆయన మంచి పేరు మోసిన జ్యోతిష్కుడు. ఆయన చేయి చూసి భవిష్యత్తు చెప్పడమే కాకుండా, అంజనం వేసి పోయిన వస్తువులు ఎక్కడ దొరుకుతవో చెప్పేవాడు.

ఒకనాడు ఆయన పని మీద పొరుగూరు వెళ్ళి తిరిగి వస్తూ, మిట్టమధ్యాహ్నపు ఎండవేళ కావడంతో, కాసేపు విశ్రాంతి తీసుకుందామని, దారి పక్కన వున్న ఒక సత్రం అరుగు మీద గొడుగు పక్కన పెట్టుకుని కూర్చున్నాడు. కొద్దిసేపట్లో ఆయనకు కునుకుపట్టి, అక్కడే పడుకుని నిద్రపోయాడు. మెలుకువ వచ్చేసరికి సాయంకాలమయింది. వెంట తెచ్చుకున్న గొడుగు కనిపించలేదు.

భద్రయ్య, గ్రామాధికారి దగ్గిరకు పోయి, గొడుగు పోయిందంటూ ఫిర్యాదు చేశాడు.

"గొడుగు ఎక్కడ వున్నదో తెలుసుకోవడం, మీకేం కష్టం కాదు గదా! అంజనం వేసి చూడండి," అన్నాడు గ్రామాధికారి చిరునవ్వు నవ్వుతూ.

"అలాగే చేద్దును! కాని, నేను అంజనం వేసినందుకు రెండు రూపాయిలు తీసుకుంటాను. మీరు ఆ రెండు రూపాయిలూ యిస్తానంటే, యిప్పుడే అంజనం వేస్తాను," అన్నాడు భద్రయ్య విసుగ్గా.

—సి. ఎస్. ఎ. షరీఫ్





# పుణ్యానికిపోతే?

కూనవరం గ్రామంలోని పేదవాళ్ళలో, కోటయ్య ఒకడు. అతడికి గ్రామాధికారితో పని బడింది. ఆయన దగ్గిరకు వెళ్ళి, తన కష్టం చెప్పుకున్నాడు. సాధారణంగా గ్రామాధికారి ఎవరికీ సాయం చెయ్యడు. ఏ మనసున వున్నాడో ఏమో, ఆ రోజు వెంటనే కోటయ్య కష్టంనుంచి గట్టెక్కే ఉపాయం చెప్పాడు. కోటయ్య ఆ ప్రకారం చేసి ప్రయోజనం పొందాడు.

కోటయ్య పేదవాడైనా, గ్రామాధికారికి ఏమైనా బహుమతిగా యిచ్చుకోవాలనిపించి, నలుగురినీ సలహా అడిగాడు.

''నువ్వేమిచ్చుకోగలవురా? అంతగా యివ్వాలనుకుంటే, కాస్త ఆవకాయ యివ్వు.'' అన్నారు కొందరు.

ఆవకాయపాళ్ళు కలపడంలో, కోటయ్యకు చాలా పేరున్నది. ఆ ఊరి షాహుకారు ఆవకాయ తయారు చేసి, పట్నంలో అమ్ముకుంటాడు. అది కలపడానికి ఆయన కోటయ్య సహాయం తీసుకుంటాడు. షాహుకారు, కోటయ్యకు కూలిగా డబ్బులకు బదులు, ఆవకాయే యిస్తూంటాడు. కోటయ్య అది ఊళ్ళో అమ్మి డబ్బు చేసుకుంటాడు.

కోటయ్య బాగా ఆలోచించి, తన దగ్గిరున్న ఆవకాయలో కొంత గ్రామాధికారికి బహుమతిగా యిచ్చాడు.

గ్రామాధికారి, కోటయ్య యిచ్చిన ఆవకాయ తల్లికి చూపించి, ''అమ్మా, కోటయ్య నావల్ల ప్రయోజనం పొంది, ఈ ఆవకాయ తెచ్చి యిచ్చాడు. ఎవరేం యిచ్చినా కాదనకుండా పుచ్చుకోవాలని, నువ్వనడం వల్లనే, నేనిది తీసుకున్నాను. వాడి ఆవకాయకు చాలా పేరున్నది. ఈ విధంగానైనా ఇంటిల్లపాదీ రుచిచూడవచ్చు,'' అన్నాడు.

జొన్నలగడ్డ రామలక్ష్మి

గ్రామాధికారి తల్లి ఆవకాయ చూసి ముఖం చిట్లించి, "నీకు బహుమతిగా వచ్చింది కనక, దీన్ని నువే తిను. ఇంట్లో మరెవ్వరూ యిది తినకూడదు," అన్నది.

గ్రామాధికారి ఆ రోజే ఆవకాయ రుచి చూశాడు. అద్భుతంగా వున్నదనిపించింది. ఇతర కూరలు మాని, రెండు రోజులపాటు ఆవకాయతోనే భోజనం ముగించాడు. దానితో అయనకు అజీర్తీ, పొట్టనొప్పి పట్టుకున్నవి. మంచం మీది నుంచి దిగ లేని స్థితికి వచ్చాడు. అయన తల్లి వైద్యుడికి కబురు చేసింది.

వైద్యుడు, గ్రామాధికారిని పరీక్షించి, "తమ పరిస్థితి ఏమీ బాగా లేదు. ఉన్న పళంగా రజతభస్మం వాడాలి. అందుకు పదివరహాలు అవసరం," అన్నాడు.

విధిలేక గ్రామాధికారి, వైద్యుడికి పది వరహాలు యిచ్చుకున్నాడు. వైద్యుడిచ్చిన మందుతో అయన జబ్బు రెండు రోజుల్లో పూర్తిగా నయమైపోయి, తిరిగి మామూలు మనిషయ్యాడు.

గ్రామాధికారి పేరుమోసిన పిసినారి. కోటయ్య కారణంగా అటు డబ్బూపోయి, యిటు ఆరోగ్యం కూడా చెడిందని, ఆయనకు బాధపట్టుకున్నది.

అయన ఒకనాడు వైద్యుణ్ణి పిలిపించి, "నా జబ్బుకు వైద్యం చేయడానికి నువ్వు



పది వరహాలు తీసుకున్నావు; అంతవరకూ బాగానే వున్నది. కాని, నువ్వు అందరికీ యాభైవరహాలు తీసుకున్నానని చెప్పాలి. అలా చేయకపోతే, యీ గ్రామంలో నువ్వు చాలా యిబ్బందులకు గురవుతావు," అన్నాడు.

అనారోగ్యంగా వున్నంతసేపూ గ్రామాధికారి, వైద్యుడంటే భయపడ్డాడు. ఇప్పుడు, ఆరోగ్యంగా వున్న గ్రామాధికారంటే వైద్యుడికి భయం!

ఆ కారణం వల్ల, వెంటనే వైద్యుడు గ్రామాధికారితో, "మీరు చెప్పమన్నట్టు చెప్పడం వల్ల, నాకేమీ నష్టం లేకపోగా లాభం వున్నది. అందరూ మీలాగే, నాకు



ఎక్కువ డబ్బు యిస్తారు,'' అని వెళ్ళి పోయాడు.

తర్వాత గ్రామాధికారి, కోటయ్యకు కబురంపి, ''నువ్విచ్చిన ఆవకాయ తినడం వల్ల, నాకు జబ్బు చేసింది. అందుకు యాభై వరహాలు వైద్యానికి ఖర్చయింది. ఆ యాభై వరహాలూ నువ్వే యిచ్చుకోవాలి!'' అన్నాడు.

కోటయ్య తెల్లబోయి, ''అయ్యా, నేను పేదవాణ్ణి. అంత డబ్బెక్కణ్ణించి తెచ్చి యివ్వగలను?'' అన్నాడు.

''ఎలా తెస్తావో, నాకు తెలియదు. నేనడిగినదాంట్లో న్యాయం వుంది. నువ్వు డబ్బు తేలేని పక్షంలో శిక్ష అనుభవించవలసి వుంటుంది,'' అన్నాడు గ్రామాధికారి కోపంగా.

కోటయ్య యింకేమీ మాట్లాడలేక, తిన్నగా వైద్యుడింటికి వెళ్ళి, ''నాకెలాగూ శిక్ష తప్పదు. అందువల్ల, నేరం చేసే శిక్ష అనుభవిస్తాను. ఆ నేరమేమంటే— నిన్ను చంపడం!'' అన్నాడు కసిగా.

''నన్ను చంపడమేమిటి? నేను, నీకేం అన్యాయం చేశాను?'' అన్నాడు వైద్యుడు.

''నువ్వు, మామూలు జబ్బుకు యాభై వరహాలు తీసుకున్నావు. ఇప్పుడు గ్రామాధికారి, ఆ డబ్బు నన్నిచ్చుకోమంటున్నాడు. కాస్తోకూస్తో అయితే, ఎలాగో యిచ్చుకొందును. యాభైవరహాలు నేనెక్కణ్ణించి తెచ్చేది!'' అని కోటయ్య, తన కథ అంతా వివరంగా వైద్యుడికి చెప్పాడు.

వైద్యుడు అంతా విని, ''ఆహాఁ, అదన్న మాట సంగతి! నీవంటి పేదవాడికి అన్యాయం తలపెట్టిన గ్రామాధికారికి బుద్ధి చెప్పవలసిందే,'' అంటూ కోటయ్య చెవిలో ఏదో చెప్పాడు.

అది వింటూనే కోటయ్య, వైద్యుడి కాళ్ళ మీద పడి, ''నువ్వు చాలా మంచి వాడివి. అనవసరంగా నిన్ను కొట్టడానికి వచ్చాను,'' అని, ఆయన్నీ, మరి కొందరు గ్రామ పెద్దలనూ తీసుకుని గ్రామాధికారి ఇంటికి వెళ్ళాడు.



అక్కడ కోటయ్య జరిగింది అందరికీ చెప్పుకుని, తనకు న్యాయం కలిగించ వలసిందిగా కోరాడు.

గ్రామంలో అందరికీ, గ్రామాధికారితో ఏదో ఒక అవసరం అయిన పని వున్నది. ఆ కారణం వల్ల అందరూ కోటయ్యతో, "నీ కారణంగా ఆయనకు జబ్బు చేసింది. అందువల్ల, వైద్యానికయిన ఖర్చు యిచ్చుకోవలసిన బాధ్యత నీదే!" అన్నారు.

అప్పుడు కోటయ్య గ్రామాధికారి కేసి తిరిగి, "అయ్యా, నేను డబ్బు యివ్వక తప్పదా? నావంటి పేదవాడిని చూసి, మీ మనసు కరగదా!" అన్నాడు.

"తప్పు చేసినవాళ్ళందర్నీ చూసి మనసు కరిగించుకోవాలంటే, నేను గ్రామాధికారిగా వుండలేను. నువ్వు డబ్బు యిచ్చి తీరవలసిందే!" అన్నాడు గ్రామాధికారి.

ఆ మాట వింటూనే కోటయ్య పెద్దగా అరిచి నేల మీద పడిపోయాడు. ఏమయిందంటూ అందరూ కంగారు పడసాగారు.

వైద్యుడు, కోటయ్యను పరీక్షించి, "వీడికి రక్తపుపోటు వచ్చింది. ఎవరికైనా భరించరాని కష్టమూ, ఆవేశమూ కలిగినప్పుడు, యిలా జరుగుతుంది. పాపం, ఇది వీడిలాంటివాడికి రావలసిన జబ్బు కాదు. దీని వైద్యానికి స్వర్ణభస్మం వాడాలి! కనీసం వందవరహాలు ఖర్చవుతుంది. ఎవరిచ్చుకుంటారు?" అని అడిగాడు.

అప్పుడు అక్కడ చేరిన గ్రామ పెద్దలందరూ కూడబలుక్కుని, "ఇలాంటి సందర్భాల్లో జరగవలసిన న్యాయమేమిటో, ఇంతకు ముందే మన గ్రామాధికారిగారు చెప్పారుగదా. ఆయన కారణంగానే కోటయ్యకు జబ్బు వచ్చింది కాబట్టి, వైద్యానికయ్యే ఖర్చు ఆయనే భరించాలి," అన్నారు.

గ్రామాధికారికి పచ్చివెలక్కాయ గొంతులో పడ్డట్టయింది. ఇది కోటయ్య పన్నినపన్నాగమని ఆయనకు అర్థమై

పోయింది. ఇందుకు వైద్యుడి సహకారం వున్నదని, ఆయనకు అనుమానం కలిగింది.

దానితో గ్రామాధికారి, వైద్యుడి కేసి కోపంగా చూస్తూ, ''రక్తపుపోటు వైద్యానికి నూరు వరహాలా? వైద్యానికింత పెద్ద మొత్తాలు అడగడం, నేను సహించను,'' అన్నాడు.

వైద్యుడు ఎంతో వినయంగా, ''అజీర్ణానికి వైద్యం చేస్తే, తమరు నాకు యాభై వరహాలిచ్చారు. అది న్యాయమని కూడా తమరు అభిప్రాయపడ్డారు. అజీర్ణవ్యాధి ఒక్క రోజులో పోతుంది. కాని, రక్తపుపోటు జీవితాంతం బాధపెడుతుంది. అలాంటి మొండివ్యాధికి నూరు వరహాలు చాలునన్నానంటే అందుకు కోటయ్య పేదవాడు కావడమే కారణం,'' అన్నాడు.

గ్రామాధికారి యిప్పుడేం చేయాలన్న ఆలోచనలో పడ్డాడు. అంతలో కోటయ్య నెమ్మదిగా లేచి కూర్చుని, ''ఏం జరిగింది?'' అన్నాడు నీరసంగా.

వైద్యుడు, అతడి చెవి దగ్గిర బిగ్గరగా, ''నీకు రక్తపుపోటు వచ్చింది! దాని వైద్యానికి నూరు వరహాలు ఖర్చవుతుంది. నువ్వు గ్రామాధికారిగారికి యాభైవరహాలు యిచ్చుకోవాలిగదా! అది పోను వారిప్పుడు నీకు యాభైవరహాలిస్తారు. నేను వైద్యం చేసేందుకు, నువ్వింకా యాభైవరహాలు తేవాలి,'' అని, అంతా వివరంగా చెప్పాడు.

అంతా విని కోటయ్య లేచి నిలబడి, గ్రామాధికారి కాళ్ళకు నమస్కరించి, ''తమరు ధర్మప్రభువులు! చావనైనా చస్తానుగాని, వైద్యానికి మీ దగ్గిర డబ్బు తీసుకుంటానా? నా పాట్లేవో నేపడతాను,'' అని, అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

గ్రామాధికారి అవమానంతో బిక్కచచ్చిపోయాడు. ఆ తర్వాత, ఆయనెప్పుడూ ఎవరికీ అన్యాయం తలపెట్టలేదు. కోటయ్య కూడా—పుణ్యానికి పోతే పాపం ఎదురవుతుందని, అడగకుండా పెద్దలకు ఊరికినే బహుమతులిచ్చే పద్ధతి మానుకున్నాడు.



# నార్వే లెమింగ్స్

ప్రతి మూడు నాలుగు సంవత్సరాలకు ఒకసారి చిట్టెలుక జాతికి చెందిన నార్వే లెమింగ్స్ అనే జంతువులు అతి విచిత్రంగా ప్రవర్తిస్తాయి. తమ నివాస స్థానాలైన కొండల నుంచి బయలుదేరి మందలు మందలుగా సముద్రంకేసి ప్రయాణం సాగించి, సముద్ర జలాలలో దూకి మునిగిపోయే దాకా ఈదుతూ వెళ్ళిపోతాయి. అవి ఎందుకలా చేస్తున్నాయో ఇంకా అంతుబట్టని ఒక ప్రకృతి వింతగానే ఉంటున్నది:

మామూలుగా ఒక లెమింగ్ యేడాదికి పది పిల్లల్ని కంటుంది. ఆ లెక్కలో వీటి సంఖ్య, రెండు మూడేళ్ళలో, దాపుల్లో లభించే ఆహారానికన్నా ఎన్నోరెట్లు ఎక్కువగా పెరిగిపోతాయి. ఉన్న ఆహారం చాలకపోవడంతో సముద్రం ఆవతలి గట్టున ఆహారం ఉంటుందన్న ఆశతో పయనం సాగించి ఇలా మునిగిపోతూ ఉంటాయని కొందరు ఊహిస్తున్నారు.

నార్వేలో పర్వతశ్రేణులు సముద్రానికి కొంచెం దగ్గరలో ఉన్నాయి. అలా బయలుదేరినప్పుడు లెమింగ్స్ పగటిపూట ఆహారం వెతుక్కుంటూ, నిద్రపోతూ, రాత్రిపూట సముద్రంకేసి తమ ప్రయాణాన్ని సాగిస్తాయి. దారిలో ఎన్ని అడ్డంకులూ, అవరోధాలూ ఏర్పడినా వాటిని కలిసికట్టుగా ఎదుర్కొని అధిగమిస్తూ ముందుకు నడుస్తాయి. దారిలో పక్షులూ, జంతువులూ వీటిని సులభంగా తన్నుకుపోతాయి. అలా తన్నుకుపోగా మిగిలినవి గుంపులు గుంపులుగా ముందుకు నడుస్తాయి.

గుండ్రటి తల, చిన్న కాళ్ళూ, పొట్టితోక ఉండే ఈ లెమింగ్స్ జాతి జంతువులు ఉత్తర ఐరోపా, ఆసియా, అమెరికా ఖండాలలో ఉన్నప్పటికీ నార్వేలో మరీ ఎక్కువగా ఉంటున్నాయి. నాచు, గడ్డీ, ఆకులూ, చెట్టు బెరడులూ తినే ఈ జంతువులను, డేగలూ, గుడ్లగూబలూ, నక్కలూ, తోడేళ్ళు మొదలైన పక్షులూ, జంతువులూ వేటాడి పట్టి తింటాయి. అందువల్ల ఈ సాధు జంతువుల బతుకులు దిన దిన గండంగా గడుస్తాయి.



వేసవిలో భూమి మీద బొరియలూ, కలుగులూ చేసుకుని జీవించే ఈ జంతువులు చలి కాలంలో, కావలసినంత ఆహారాన్ని సమకూర్చుకుని మంచుగడ్డల కిందికి వెళ్ళిపోతాయి. వీటిలో ఒక రకం జంతువులకు ప్రతి శరత్కాలంలో కాళ్ళకు బలమైన గోళ్లు పుట్టుకొస్తాయి. ఇవి బొరియలు చేయడానికి ఉపయోగపడతాయి.


CHANDAMAMA

## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1985 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



A. L. Syed

★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ అగస్టు నెల 15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: చూడరా, యీ విచిత్రం! రెండవ ఫోటో: స్నేహం ఎంతో పవిత్రం!

పంపినవారు: వి. రవికుమార్, భవానీనగర్, మల్కాజ్‌గిరి, హైదరాబాద్-47

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు

1. పైథాగరస్ 2. ఎరటోస్తనీస్ 3. ధ్రువ ప్రాంతాలలో భూమ్యాకర్షణ శక్తి ఎక్కువ. 4. రోటర్‌డామ్ రేవు పట్టణం 5. ఆస్ట్రేలియాలో వున్న ఎడారి.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# మాల్టోవా ముఠా అకస్మాత్తుగా చేసిన గమ్మత్తు

ఆరోజు మిన్నీ పుట్టిన రోజు పండగ. ముఠా మొత్తం వాళ్ళ తోటలో కూర్చుని మాల్టోవా బాగుగా మిగిలిపోయిన కేక్ తింటున్నారు. అబ్బ, ఎంత మంచి కేకో అది! చిందా రాక్‌లెట్ ఐసింగూ, కొబ్బరితురుమూ. ప్యాకెట్ ఒకరి నుంచి మరొకరికి అందిస్తుంటే ఎంత మజా వచ్చిందో. ఇక మిన్నీకి వచ్చిన బహుమతుల అన్నీ ఇన్నీ కావు. అయితే ముటుకు పుట్టిన రోజు పండగ జరుపుకుంటున్న మిన్నీ మాత్రం మాట్లాడకుండా కూర్చుంది.

**"ఏమిటి మిన్నీ, ఏమిటీ సంగతి?"**

"అనాథాశ్రమంలో పీరూ తెలుసుకదూ బాబూ! నిన్న మమ్మీ ఆ అబ్బాయిని రమ్మంది. ముందెప్పుడూ వాడు పుట్టిన రోజు పండగం చేసుకోలేదు తెలుసా! అనాథాశ్రమంలో పుట్టిన రోజు పండగలెవరూ జరుపుకోరు. వాడి పుట్టిన రోజేమో ఈ శనివారం" మిన్నీ కళ్లలో నీళ్లు తిరిగి రెండు పెద్ద బొట్లు చెంపల మీదకి జారాయి. అందరూ నిశ్శబ్దమైపోయారు. అందరికీ పీరూ తెలుసు, ఇష్టం కూడాను. ఆ అబ్బాయి ముఖంలో నవ్వే కనిపించేది కాదు పాపం.

**సలీంకు గొప్ప ఐడియా వచ్చింది.**

సలీం గమ్మత్తుగా ముఖం పెట్టి నవ్వుకున్నాడు. పీరూకు చెప్పా పెట్టకుండా పార్టీ ఏర్పాటు చేస్తేనో! అందరూ అది గొప్ప ఐడియా అన్నారు. బాబూ తేజు అప్పి డబ్బుల్లో కొంత మిగిలించి, పదికొస్తుంది. నేను వాళ్లమ్మ కేక్ చేసివ్వగలరు. మాలతి కూడా సహాయం చేస్తానంది. మిన్నీ తనకొచ్చిన బహుమతుల్లో కొన్ని ఇస్తానంది. ముఠా మొత్తం సంబరపడి పోయారు. అందరూ రహస్యాన్ని గుండెల్లో దాచుకున్నారు.

**పీరూకి తెలియని రహస్యం.**

ఆ శనివారం నాడు పీరూని సలీం ఇంటికి పిలిచాడు. ఎవ్వరూ ఎదురొచ్చి పలకరించలేదు పాపం. బెరుగ్గా వచ్చి తలుపు కొట్టాడు. అదే తెరుచుకుంది. "ఎవరన్నా ఉన్నారా, లేరా" బెరుకుగా అన్నాడు. ఇల్లంతా చీకటి మయం. ఉన్నట్టుండి లైట్లు వచ్చేశాయి. అందరూ "హాపీ బర్త్ డే" పాడటం మొదలెట్టారు. అనాథాశ్రమం నుంచి పీరూ నేస్తాలూ, మాల్టోవా ముఠా అందరూ అన్నమాట. టేబిలు మీద తెలుపూ గులాబీ రంగూ కలిసిన పెద్ద కేకొకటి. ఎక్కడ చూసినా బెలూన్లూ, వేడి-వేడి మాల్టోవా కప్పులూనూ. ఎన్నో బహుమతులు కూడా! పీరూకి అదొక బ్రహ్మాండమైన పార్టీ అయిపోయింది. ఆ తటితటి కళ్లూ, ఆ పెదవుల మీది చిరునవ్వూ అదే చెప్పక చెప్పాయి!

**అదే మరి మాల్టోవా మహత్యం.**

అవును, మాల్టోవా తాగే పిల్లలు జీవితంలో ఆనందాన్ని సంపూర్తిగా ఆస్వాదిస్తుంటారు. ఎందుకంటే ఒక్కొక్క కప్పు మాల్టోవాలో బంగారమంటి గోధుమలు, బార్లీ, శుద్ధమైన పాలు, సమృద్ధిమైన కోకో, చక్కెరల మంచితనం నిండుగా ఉంది. వీటితో మంచి నిరోధక శక్తి, బలము, దమ్ము వస్తాయి. మీ పిల్లలకు మాల్టోవా ఇవ్వండి. వాళ్ళు బలంగా, ఆరోగ్యంగా పెరగడం చూసి ఆనందించండి. మాల్టోవా మీ పిల్లలకు జీవితంలో ఉరకల ఉత్సాహాన్నిస్తుంది.

**మాల్టోవా క్లబ్‌లో చేరండి:**

ఎంతో సులభం.
మూడు 500 గ్రా. సీసాల లేబిళ్లు, లోపలి సీళ్లు లేదా మూడు 500 గ్రా. రీఫిల్ ప్యాకులపైని ఫ్లాపులు ఈ చిరునామాకు పంపారంటే చాలు:

**ది మాల్టోవా క్లబ్**
4వ ఫ్లోరు, భండారీ హౌస్, 91 నెహ్రూ ప్లేస్,
న్యూ ఢిల్లీ 110019.

మీరిక చేరిపోయినట్టే!




JIL జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్

## విటమిన్‌లతో నిండిన మాల్టోవా: ఆరోగ్యం, బలం మరియు శక్తికోసం

SIMOES/JIL/002/84 TEL